



# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
( 1938 - 1972 )
శుక్రవారం : 9-5-'75

*సంపుటము : 68 సంచిక : 34*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

సంవత్సర చందా – రు. 33–80 పై.
ఆరుమాసాల చందా – రు. 16–90 పై.
విడిప్రతి వెల 60 పైసలు

**ఆంధ్రపత్రిక కార్యాలయము**
గాంధీనగరం, విజయవాడ-520003.


## విషయానుక్రమణిక

అట్టమీది బొమ్మ :
'బాపు' అనుకూరాయి?

**కథలు :**



**పై వారమే కొత్త సీరియల్**

## మనలో మాట

పై వారం నుంచి 'ఈ సంఘంలో కుటుంబమే ఇది' సీరియల్ కథ వేద్దామనుకుంటున్నాము.

* * *

పోయినవారం సమయానికి అందని కారణంగా ఊమెన్‌గారి లోకంపోకడ అందించలేకపోయాము. ఈ వారం నుంచి 'లోకంపోకడ' శీర్షిక యెప్పటివలె వేస్తున్నాము.

'అంతర్జాతీయ మహిళా సంవత్సరం' మీద గతసంచిక రెండవపేజీలో పడ్డ కార్టూన్‌లు 'మగ' కార్టూనిస్టెవరైనా వేసుంటే మా 'పఠిత'లూహించినట్లు అక్కడచోటు చేసుకొనేవి కావేమో! కుమారి "రాగతి పండరి"బాయి వేసి పంపిన యీ వ్యంగ్య చిత్రాలు మా పాఠకులకు కూడా నచ్చాయనే ఆశిస్తున్నాము ...

ఈ సందర్భంలో 'కార్టూన్'లు వేసి పంపే వారందరికి ఒకటి రెండు చిన్న విజ్ఞప్తుల్లాంటివి చేయాలనుకుంటున్నాము. పొడుగు క్రాపులమీద, బెల్‌బాటమ్‌ల మీద, వంటింటి మీద మాకు చేరే కార్టూన్‌లు అసంఖ్యాకం. ఇక సినిమా పాటల మీద వాటిలో ద్వంద్వార్థాలున్న పదాలపై వచ్చే వ్యంగ్య చిత్రాలు కూడా ఎక్కువనే ... ఒకే అంశంమీద పదే పదే వేసే కార్టూన్‌లు పాఠకులను నవ్వించలేవని మనవి. కార్టూన్‌లు పంపేవారు కూడా మాకు అక్కరలేని వాటిని తిప్పిపంపే నిమిత్తం స్వంత చిరునామా గల తగినన్ని తపాలాబిళ్ళ లంటించిన కవర్‌లు పంపడం మంచిది ... కార్టూన్‌లైనా రచనలైనా అవి స్వంతవైనా, అనుకరణలైనా, ఎవరివైనా సరే లోగడ ఒకసారి అచ్చు కాకూడదు. స్వంత రచన అన్న హామీ పత్రం పంపేటప్పుడు — యింకెవరికీ పంపలేదు...యింకెక్కడా అచ్చుకాలేదు అన్న మాట కూడా చేర్చితే మంచిది.

## హైదరాబాద్ నోట్‌బుక్

### జిల్లాస్థాయిలో తెలుగు

ఆనంద సంవత్సరాదినుండి తాలూకా స్థాయిలో తెలుగు అధికారభాషగా అమలు పరచబడింది. ఈ రాక్షస ఉగాదినుంచే జిల్లాస్థాయిలో అమలు అవుతుంది. ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు ఏప్రిల్ 12న ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా ఎగ్జిబిషన్ గ్రౌండ్సులో ప్రత్యేకంగా నిర్మించిన శాతవాహన నగర్‌లో ఏర్పాటు చేసిన "తరతరాల తెలుగుజాతి" ప్రదర్శనాన్ని ప్రారంభిస్తూ ఈ ప్రకటన చేశారు. ఎన్ని చిక్కులు ఏర్పడినా, తెలుగును అధికారభాషగా అమలు పరచడానికే ప్రభుత్వం నిశ్చయించిందని, ఆయన స్పష్టపరిచారు. వచ్చే సంవత్సరం నుంచి రాష్ట్ర స్థాయిలో తెలుగు అధికారభాష అవుతుంది.

### ఉపశ్రుతి :

"చూచారా, వర్ణాంతర వివాహం చేసుకొన్నవారి సంతానం తలిదండ్రుల వర్ణంలో ఏది తమకు అనుకూలమో దానిని స్వీకరించ వచ్చునని ప్రభుత్వం ప్రకటించింది." అన్నాను ఒక సంఘ సంస్కర్తతో.



ప్రపంచ తెలుగు మహాసభలలో ఎగరేసిన "గాలి గుమ్మటం"

"అయ్యా, వారి సంతానంవరకు ఎందుకు? నాకు అనుకూలమైన వర్ణం అనుసరించే అవకాశం కల్పించండి. ఇప్పుడు నా వర్ణం వదిలేస్తాను." అన్నారు మా సంభాషణ వింటున్న ఒక ఉద్యోగి.

—తిరుమల రామచంద్ర

## మాజీ రాష్ట్రపతి డాక్టర్ రాధాకృష్ణన్ నిర్యాణం

మాజీరాష్ట్రపతి, ప్రముఖ విద్యావేత్త, సుప్రసిద్ధ తత్వవేత్త, మేధావి, రాజనీతిజ్ఞుడు అయిన డాక్టర్ సర్వేపల్లి



రాధాకృష్ణన్ ఏప్రిల్ 16వ తేదీరాత్రి తమ 86వ ఏట మదరాసులోని ఒక ప్రైవేటు నర్సింగ్ హోంలో మృతి చెందారు. ఆసమయంలో ఆయన కుమారుడు డాక్టర్ గోపాల్, శ్రీమతి గోపాల్, కుమార్తెలు యిద్దరూ ఆయన చెంత ఉన్నారు.

డాక్టర్ రాధాకృష్ణన్ నిరుపేద కుటుంబంలో పుట్టినా స్వయం ప్రతిభతో గొప్పవిద్యావేత్త అయి విద్యా, రాజకీయ రంగాలలో అత్యున్నత పదవులను అలంకరించి అందరి అభిమానాన్ని చూరగొన్నారు.

తత్వశాస్త్రంలో ఆయన గొప్ప పరిశోధన చేశారు. 'భారతీయ తత్వశాస్త్రం' అనే గ్రంథాన్ని, యింకా ఎన్నో గ్రంథాలని రచించారు. అంతర్జాతీయ ఖ్యాతి గాంచారు 'మహా మహోపాధ్యాయ' అని కీ. శే. నెహ్రూపండితుడు డాక్టర్ రాధాకృష్ణన్‌ని కీర్తించేవారు.

డాక్టర్ రాధాకృష్ణన్ భారతరత్న గౌరవాన్ని అందుకున్నారు. హిందూమత ప్రాభవానికి ఆయన చేసిన కృషికి 'టెంపుల్‌టన్' అవార్డు ఈ మధ్యనే వారికి లభించింది.




కూతురు నిదుర పోతే క్రాంతి వడగళ్ళ వాన వెలిసినంత ప్రశాంతత ఫీలవుతుంది. బేబీకి రెండేళ్ళు.

సామాన్లు సర్దటంలో ఆరితేరినఅమ్మాయి. పడకగది తలుపులు చేరవేసి, డ్రాయింగ్ రూమ్ లోకి వచ్చి వార్తాపత్రిక చేతిలోకి తీసుకుంది. కాలింగ్ బెల్లు మ్రోగింది. విసుక్కుంటూ తలుపు తీసింది. పోస్టుమాన్ రెండు కవర్లు ఇచ్చి వెళ్ళిపోయాడు. ఒకటి మామగారు రాశారు. క్షేమ సమాచారాలు మాత్రమే ఉన్నాయి. రెండవ కవరు మీది దస్తూరి చూస్తూనే ఆనందముతో గంతులు వేయాలనిపించిందేమో, కూనిరాగం తీస్తూ కుర్చీలో కూర్చుంది. శుభలేఖ మాత్రమే కనిపించింది.

'ఇది వర్స్ట్ ఫూల్ !'అని స్నేహితురాలిని తిట్టుకుని శుభలేఖ చూచింది.

వి సౌ రాధను... చి. ప్రసాద్, యమ్. ఎస్. యు.ఎస్.ఎ కు అని ఉంది. తారీఖు, స్థలం చూచుకుని మరోసారి సంతోషపడింది. రాధ, క్రాంతి ఒకటవ తరగతి నుండిబి.యస్సీ. వరకు కలిసి చదువుకున్నారు: మంచి స్నేహముంది. క్రాంతి తల్లికి చదివించే స్తోమత్తు లేక వివాహము చేసింది. రాధ అమెరికావెళ్ళింది పై చదువుల కోసము. క్రాంతి సంసారములో మునిగి తేలుతూ ఉత్తరాలు రాయటం అశ్రద్ధ చేస్తుంది. బహుశః రాధకు చదువు మూలాన తీరిక ఉండదేమో. ఈ రోజు. మూడు సంవత్సరాల తరువాత, శుభలేఖ వచ్చింది. తప్పక స్నేహితురాలి వివాహానికి వెళ్ళాలని నిశ్చయించుకుంది. ఢిల్లీలో క్రాంతిభర్తకు ఉద్యోగము. రెండున్నర సంవత్సరాల క్రితం ఢిల్లీ వచ్చింది మళ్ళీ హైదరాబాద్ వెళ్ళనేలేదు. దాదాపు పదిహేను వందల జీతము వచ్చినా, మామూలు జీవితం గడపడం కష్టమయిపోతుంది. ధరల పెరుగుదల, తోటివారితో సమంగా ఉండాలనే తాపత్రయము, కుటుంబ భారము తలయెత్తుకోనివ్వవు. ఏనెల కానెల ఇంతో, అంత మిగల్చాలి అనుకుంటారు. కాని అప్పులేకుండా బ్రతకడమే ఓ వరంలా అనిపిస్తుంది. తల్లిని చూడాలని ఉన్నా, ఆమెకు తనకు చార్జీలు ఇచ్చి పిలుచుకుపోయే శక్తిలేదు. అందుకే పురుడుకూడా ఢిల్లీలో పోసుకుంది. క్రాంతి భర్తకూడా హద్దులూ, అజ్ఞలు, అంటూ హడావుడి చేసే మనిషి కాకపోయినా; పరిస్థితులు అర్థం చేసుకోలేనంత అమాయకురాలేంకాదు.

సాయంత్రము భర్త వచ్చేసరికి, ఉత్సాహంగా యెదురు వెళ్ళింది.

"ఏమిటోయ్ చాలా ఉత్సాహంగా ఉన్నావు?" బూట్లు విప్పుకుంటూ అడిగాడు.

"మారాధ పెళ్ళండీ ఈసారి తప్పక వెళ్ళాలి" అన్నది."మీరాధ పెళ్ళి తరువాత గాని మా సింగ్‌గారింట్లో పార్టీకి వెళ్ళకపోతే మన పెళ్ళిచేస్తాడు."

"ఏం మనుషులండీ, నాస్నేహితురాలి పెళ్ళి వార్త చెబితే మీ స్నేహితుని పార్టీ ముఖ్యం అంటారేం ?" తిరిగి చూచేసరికి, శ్రీనివాస్ లేడు అక్కడ అతను బాత్‌రూమ్‌లో దూరినట్టున్నాడు.

"ఛీ...ఇదంతా ఇంట్లో కూర్చుని తింటూ ప్రతి పైసాకు అతని మీద ఆధారపడటం వల్లే ఇంత నిర్లక్ష్యం. ఈసారి బేబి పెద్దదవుతుంది, ఏదయినా చిన్న ఉద్యోగం చూచుకోవాలి." అనుకుంది క్రాంతి.

టీ త్రాగి ఇద్దరూ సింగ్ ఇంటికి వెళ్ళారు. అప్పటికే అందరూ చేరారు అక్కడికి. ఒకరిపై ఒకరు జోకులు విసురుకుంటూ, భోజనముతోపాటు కబుర్లు భోజనము చేస్తున్నారు. క్రాంతి మాత్రం మౌనంగా ఆలోచిస్తుంది. రాధ పెద్ద చదువులు చదివింది. చదువువల్ల సంస్కారము, విశాల భావాలు అబ్బుతాయి తనకు చదువుకునే అవకాశాలుండి కూడా చదువుకోలేకపోయింది..."

"ఏమోయ్ శ్రీనివాస్ మీ ఆవిడకు మౌనవ్రతమా ఏమిటి?" శాస్త్రి అడిగాడు.

"బయటనే ఈ పోజు ఇంట్లో నేనే మౌనము వహించాలి." అన్నాడు. అందరూ నవ్వారు.

# బొట్లుగా కారని హెయిర్ డై




## క్రొత్త ట్రూ-టోన్ జెల్

ఇదిచిక్కనిది, జెల్లీ లాంటిదిగనుక దీనిద్వారా నెరిసినజుట్టుకు ఎంతో సులభంగా, ఏకరీతిలో ఏమాత్రం గజిబిజి కాకుండా నీటుగా డైయింగ్ చేసుకోవడానికి వీలవుతుంది

జె. కె. హెలిన్ కర్టిస్ లిమిటెడ్,
బొంబాయి 400 038 వారి
నాణ్యమైన ఉత్పత్తి

డై మరియు డెవలపర్ మిశ్రమం చేసినప్పుడు ట్రూ-టోన్ జెల్ చిక్కగా అవుతుంది. జుట్టు కుచ్చులనుండి జారిపోదు. మంచి రీతిలో డై గ్రహింపబడి జుట్టు సహజమైన రీతిలో కనిపించేటట్లుగా చేస్తుంది.

ఇది ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన హెయిర్ డైలను తయారుచేసే హెలిన్ కర్టిస్ వారి విశేషానుభవంతో తయారుచేయబడిన హెయిర్ డై.

*ట్రూ-టోన్ ద్రవపదార్థపు హెయిర్ డై కూడా దొరుకుతుంది.




**ట్రూ-టోన్ జెల్‌లో హెయిర్ కండిషనర్ కూడా కలదు!**

దక్షిణ ఇండియాకు డిస్ట్రిబ్యూటర్లు : ప్యారీ & కంపెనీ లిమిటెడ్

# ప్రశ్నావళి

## కె. రామలక్ష్మి

ఎల్. ఎన్. ఆర్. విజయవాడ

నేను యిద్దరు స్త్రీలని ప్రేమించాను.

ఇద్దర్నేనా? కింగ్ సాల్మన్‌కి ఐదొందలమంది ర్యలు, ఏడు వందలమంది ఉంపుడుకత్తెలు ఃడేవారట మీరు ఇద్దర్ని ప్రేమించడానికి ఘమానిస్తున్నారా. . ఛట్— ఛట్ రాజు ర్ని చూసి ఉత్సాహం తెచ్చుకోండి!

ఎవాహిత అయిన స్త్రీతో ప్రేమకలాపం గించాను. ఇప్పుడావె భర్తకి తెలిసిపోయింది. ూ?

సెండ్ ఫ్లవర్స్ టు యువర్ ఫ్యూనరల్!

ే కె ఎమ్. పర్లాకిమిడి

మిమ్మల్ని ఏదైనా సభకు ఆహ్వానిస్తే సభ ఃలను గొప్పగా బోరెత్తించేస్తారుకదూ?

నేనేం రాజకీయవేత్తనా? సంఘ సంస్కర్తనా? ప్రేక్షక శ్రోతల నాడి తెలియకుండా గుడ్డిగా ాగడానికి!

ఎస్. ఆర్ కె, ఆర్. వెదుళ్లపల్లి.

మీరు చెప్పేవి శ్రీరంగ నీతులట చేసేవన్ని అంటున్నారు

శ్రీరంగ నీతులు బోధిస్తే వో వారంలో నా రచనా వ్యాసంగం ముగిసిపోయేది! ఇక ఉన్నవి రెండు చేతులు— ఎందరి నోళ్లు మూయను? అందుకే నేనే చెవులు మూసుకుంటున్నాను. చేత నైనంత మంచి చేయడమే నా డ్యూటీ దాన్ని మెచ్చుకుందుకు ఎవరో ఒకరు ఉండకపోరు

ఎమ్. వి. డి. గోపాలపురం

మీ జవాబులు చదువుతూంటే— చాలా హాట్‌గా ఉంటుంది కొంచెం స్వీటు కూడా చేర్చండి

నా కస్సలు స్వీటు సహించదు విమలా ఏం చెయ్యను? స్వీటు తెప్పించుకుని కొసరుకి (వోపిగ్గా) కొంచెం హాటు తెప్పించుకొంటూండే వారు రజని లాంటి వాళ్ళు ఇక్కడ అప్పుడే నేను ఆ కొసరే మేసి వూరుకొనేదాన్ని!

జి ఎన్ ఆర్. సిద్దిపేట

ప్రభుత్వం జనాభా పుట్టకుండా కుటుంబనియం త్రణను ప్రవేశపెట్టింది మరి జనాభా గిట్ట డానికి?

అయ్యో పిచ్చి తండ్రీ! తిండికి గింజల్లేకుండా — వాడుస్తోంది కదా!

జి. ఎన్ ఆర్ కాకినాడ.

మగవారి మాటలు నీటిమీది వ్రాతలు అంటారు గదా ఎంతవరకు నిజం?

అక్షరాలా నిజం సోదరీ (అసలక్షరాలే ఉండవుకద!)

---

ఆమె ఆలోచనా స్రవంతికి గండి పడింది. ార్టీ అయ్యేసరికి పదకొండు గంటలు ాటాయి. వస్తూనే నిదుర వస్తుందని, ఃదుకున్నాడు శ్రీనివాస్.

"హమ్‌కు డర్ లగతా మేమ్ సాబ్. ఘహీం సోజావూ!" పని పిల్ల చున్ని అడిగింది.

"అచ్చా." ఓ దుప్పటి తెచ్చి ఇచ్చింది. ఆమె మనసును ముసిరిన ఆలోచనలు యెంతకూ తెగటంలేదు

"క్రాంతీ!. .లే." ఉలిక్కిపడి లేచింది. టీపాయ్‌మీద టీ పాట్ పెట్టిఉంది, ప్రక్క నున్న కుర్చీలో కూర్చుని పేపర్ చేతిలోకి తీసుకున్నాడు అతను.

'చున్నీ వెళ్ళిపోయిందా?"

"ఆ జేబికి పాలు త్రాగించిందిలే"

'టీ యెవరు చేశారు?"

"నేనే త్వరగా బ్రష్ చేసుకురా"

ఉదయమే ఒక గంట సమయము వారికి మాట్లాడుకోవటానికి దొరుకుతుంది టీ త్రాగుతూ, పేపర్ చూస్తూ పాప అల్లరి ముచ్చటగా చూస్తూ కాలం గడుపుతారు

క్రాంతి తువాలుతో ముఖం అద్దుకుంటూ వచ్చింది అతను టీ ముట్టుకోలేదు

'మళ్లి ఇదో పోజు" అనుకుని టీ కలిప ఇచ్చింది అతనికి

'ఏమిటి అంత గంభీరంగా ఉన్నావ్?"

"ఏంలేదు"

'లేదంటే నాకు తెలియదేమిటి? మీ బాధ విహారానికి వెళ్లాలనే కదా"

"ఆలోచన ఉండగానే సరా? ఆచరించే స్వాతంత్రము లేదుకదా"

"జాణతనము దీన్నే అంటారు కాబోలు. వెళ్ళ క్రాంతీ, మీ అమ్మగార్ని చూచినట్లు ఉంటుంది."

"మీరు హృదయపూర్వకంగా చెప్పటం లేదు."

"నా మనసులో ఉన్న మాట చెబితే మళ్లీ కోపం వస్తుంది యెందుకులే"

"ఇదే కాబోలు పెద్దరికమంటే."

"నా సలహా ఏమిటంటే, హాయిగా ఓ చక్కని బహుమతి, గ్రీటింగ్స్ పంపు..."

"ఛార్జెండి దానికి అమెరికాలో మన మిచ్చే వస్తువులే తక్కువయ్యాయి మీరు మనుష్యుల్ని చులకనగా చూడటం మాని వెయ్యాలి మీ కట్నం కానుకల కోపం కార్డు పంపలేదు"

"బహుమతి కోసం బీదలు కూడా పంపరు ఆ సంగతి తెలుసుకో స్నేహాలు విలువలు మారుతుంటాయి' అని లేచి వెళ్లాడు

'ఛీ బి యస్సీ పాసయి వంటింట్లో పడి ఉండటంవల్లే కదా అతనికి చులకన!' క్రింది ఎదవు కొరుకొంటూ అతనిపై పళ్ళు నూరింది

సాయంత్రము వచ్చి అయిదు వందల రూపాయలు ఆమె చేతికిచ్చాడు

'యెందుకు?"

"యెందుకేమిటి! పెళ్ళికి వెడతా

### కానుక

న్నావుగా. చార్జీలకు, బహుమతికి, ... అన్నింటికి..."

"నాకేం వద్దు."

"అలక చాల్లేవోయ్. రిజర్వేషన్ చేయించనా!"

"ఊఁ. ." అన్నది ఏం కొనాలా అని ఆలోచిస్తూ. అతను వెళ్లిపోగానే, ప్రక్కింటి పంజాబి అమ్మాయితో బజారుకు వెళ్లింది. ఓ రెండు గంటలు గాలించి, అందమైన 'తాజ్ మహల్' బొమ్మ కొన్నది. వంద రూపాయలు చెల్లించింది. పాప కోగాను కొని ఇంటికి వచ్చింది

'యెలాగు వంద పెట్టావు మరో యాభై పెట్టి ఉంగరమో, వెండి గ్లాసులో కొనవద్దా!'

"మీ వన్నీ పాత చింతకాయ భావాలు విదేశాలలో ఉండేవారికి అలంకార వస్తువు లంటే చాలా ప్రీతి'

'మనము రెంటిక చెడ్డ వారము అవుతున్నాము విదేశీయుల ఆచారాలను పాటించలేము' అన్నాడు. ఆ తరువాత తాజ్‌మహల్ బొమ్మ ముట్టు పత్తి ఒత్తుగా పెట్టి పగిలి పోకుండా పేక్ చేశాడు.

నాల్గు రోజుల తరువాత భార్యా బిడ్డల్ని బండి యెక్కించాడు శ్రీనివాస్

"త్వరగా వచ్చెస్తూ వ్రాకదూ .." అన్నాడు. అతనికి ఒంటరిగా ఉండాలంటే దిగులుగా వుంది. క్రాంతి హృదయములో దిగులుగా ఉన్న

పి. పి. షాద్‌నగరు

మీనుండి సౌమ్యంగా జవాబు రాబట్టాలంటే ఎలాంటి ప్రశ్నలు రాయాలి?

నన్ను పొగుడుతూ రాయండి సార్. చాలు! ఎందుకు పొగడాలని మటుకు అడక్కండి.

ఎమ్. వి. ఆర్. టాటానగర్.

ఏమండీ మీకు ప్లస్‌లు ఎన్ని? మైనస్‌లు ఎన్ని?

లక్షసార్లు చెప్పాను సార్— ఏ తల్లికీ ఏ బిడ్డా మైనస్ కాదని?! ఇంకా ఎందుకీ పిచ్చి రాతలు? కొడుకుల్ని కష్టపడకుండా కనరు. కూతుళ్లనీ అంతే. ఇంక మీ కెందుకీ తేడాలు?

ఎస్. పి. బి. కాకినాడ.

మీ ప్రశ్నావళి శీర్షిక ప్రజలకు ఏ విధముగానూ ఉపయోగపడని కబుర్ల శీర్షిక

కరెక్ట్! గాసిప్ ఒకొప్పుడు టానిక్‌లా పనిచేస్తుంది— వాడి చూడండి.

వి. ఎల్. ఆర్. హైదరాబాదు

నేను గురువారము రాత్రి నిద్రలో వార పత్రిక వారపత్రిక అని కలవరిస్తానట. ఎందుకో తెలుసా?

మీ అభిమాన, సుందరతమ సుకుమార నటుని ముఖచిత్రం ఉంటుందేమోనని! అంతకంటే ఆంధ్ర యువత దేనికి ఆత్రపడుతుందీ రోజు!

బి. ఎస్. బి శ్రీకాకుళం.

మీ నోటి దురుసుతనము పోరము మీ వద్ద నేర్చుకోవాలని ఉంది.

అయ్యో రామా! శ్రీకాకుళంలో ఉంటూ యీ మాత్రం విద్యకి నా దాకా రావాలా తమ్ముడూ,! అక్కడే దొరుకుతారు— బోలెడు మంది గురువులు.

వై. డి. ఆర్— బాదంపూడి.

పవిత్రమైనది పతివ్రత అనే పదాలు ఈనాడు? పడివుండేది పవిత్రత అనే నిర్వచిస్తున్నారీనాడు!

ఎ. హెచ్. సిహెచ్. రేపల్లె.

రచయిత అనిపించుకొనుటకు ఏమి చేయాలి?

ఒకటి రెండు రచనలు ప్రచురించాలి. నీవే రాయ నక్కరలేదు. నీ పేరుంటే చాలు!

జె. జి. కె. కందుకూరు,

తడి చీరతో మంచినీళ్ల బిందె తెస్తే తప్పు లేదు. స్లీవ్‌లెస్ జాకెట్టు సరదాకి వేసుకుంటే తప్పు పడతా రెందుకీ పెద్దలు?

మొదటిది సహజం అనీ, రెండోది ఫ్యాషననీ వాళ్ల బాధ!

సి. ఎస్. ఎమ్— కందుకూరు.

భిక్షాటనం చేసే వాళ్లంతా భగవంతుని పేరు చెప్తారెందుకు?

ఇంకెవరి పేరు చెప్తే ఎవరు వూరు కుంటారు? ఇంకా వీళ్లు నయం కదా, దేవుం పేరు చెప్పి దోచుకునే వాళ్లకంటే.

స్నేహితురాలిని, తల్లిని చూస్తానన్న సంతోషంతో దిగులు వ్యక్తం చేయలేకపోయింది.

* * *

రాధను చూచిన క్రాంతి మనస్సు ఉప్పొంగిపోయింది. 'రాధీ' అంటూ కౌగలించుకుంది. అసలే పచ్చని రాధీ మరీ రంగుతేరి గులాబి పువ్వులా కనిపించింది.

"నువ్వేం మారలేదే క్రాంతి!" అన్నది నవ్వుతూ. ఇద్దరు కాసేపు మాటలు రానట్టు కూర్చున్నారు

"అమ్మా...ఇది..." బేబి వెళ్లి బల్ల మీది యాష్‌ట్రే తెచ్చింది.

"ఇది మీ ఫస్ట్ ఇష్యూనా?"

"అవునే. బేబీ ఆంటికి హల్లో చెప్పు."

బేబి ముద్దుగా 'హల్లో' అంటూ చేయి చాపింది. ఆ చెయ్యి అందుకుని నొక్కి వదిలింది రాధ.

"అమెరికాలో అయితే కనీసము అయిదా రేళ్లు లైఫ్ ఎంజాయ్ చేస్తారే. ఫ్యామిలీ ప్లానింగ్ ప్రతి ఒక్కరు పాటిస్తారు."

"అలా గా!" కాస్త చిన్నబుచ్చుకుంది క్రాంతి. మళ్లీ జవాబు చెప్పింది.

"వారికి మనకున్నంత బాధ్యత ఉండదు కదే. పెళ్లి చదువులు అంటూ హైరానా పడరు. నాకు పాతిక, ఆయనకు ముప్పై— ఇంకా ఆలస్యంగా పుట్టే పిల్లలు సమస్యగా తయారవుతారుకదా."

"అఫ్‌కోర్స్!...ఇదుగో, ప్రసాద్ వస్తున్నాడు. లేచింది.

"మీట్ మై క్లోజ్ ఫ్రెండ్ క్రాంతి ... మై ఉడ్ బి." పరిచయము చేసింది. ఇద్దరు నమస్కరించుకున్నారు.

"విడిదేమిటి డియర్ బోరు కొడుతుంది" అతను కూర్చుని సిగరెట్టు వెలిగించుకున్నాడు.

"పేకాడుదామా?" రాధ అడిగింది.

"ఓ, యస్" రాధ పేకతెచ్చికలుపసాగింది.

"రాధీ, నేను వెళ్లి అమ్మను చూసి వస్తానే" అన్నది కూతుర్ని యెత్తుకుని.

"ఓబ్బాయ్! సరాసరి వచ్చేసావా? వెళ్ల ముహూర్తం వేళకు వచ్చెయి."

"ముందే వచ్చేస్తాను." క్రాంతి ఇంటికి వచ్చింది. తల్లితో మాట్లాడుతున్నా మన సంతా రాధ దగ్గరే ఉన్నది.

కూతుర్ని తల్లి దగ్గరే వదిలి పెళ్లి వారింటికి వెళ్లింది. నల్గురు ముత్తయిదువులు పూలజడ, పాదాలకు పారాణి పెడుతున్నారు ఒంటినిండా నగలతో మెరిసిపోతుంది రాధ.

"అత్తయ్యా! పనో అని పరుగులు పెడుతున్నావు నువ్వు వెళ్ళి. క్రాంతి వచ్చింది" అన్నది బుగ్గన చుక్క పెట్టించుకుని, పాపిట సేరు తగిలించుకుంది. క్రాంతికి నవ్వు వచ్చింది.

పెళ్లి అవగానే పిల్లలు పుట్టకూడదన్న అమెరికా వాళ్ల ఏవయసుకా ముచ్చట! అని చెప్పలేదేమో అనుకుంది.

ఆ తరువాత రాధ బంధువులు రావడంతో క్రాంతి ఉనికే మరిచిపోయింది. క్రాంతి బాధ పడింది. కాని వెంటనే ఛీ నాకు ప్రాముఖ్యత ఇస్తుంది కాబట్టే నిర్లక్ష్యం చెయ్యగల్గింది. వారితో మర్యాదకోసం మాట్లాడుతుంది' అనుకుని నవ్వుకుంది.

వివాహము ముగిసింది. అందరితోటు తను తెచ్చిన కానుక అందజేసింది స్నేహితురాలికి. ఫోటోలు, అల్లరి, గోలగా ఉంది పెళ్లిపందిరి. మరురోజు మళ్లీ రావచ్చని, తన ఇంటికి బయలుదేరింది.

"ఈ రాధకేం తెలియదు. కనిపించిన వారికల్లా కార్డ్సు ఇప్పించింది. అడ్డమైన మూక వచ్చి చేరారు." విసుక్కుంటుంది రాధ అత్త.

అక్కడే ఒక బీద కుటుంబము కూర్చుని ఉంది. వాళ్లబ్బాయి అమెరికాలో ఉన్నాడట. రాధకు చాలా సహాయము చేశాడట. రాధ ఆ కృతజ్ఞతతో పిలిచింది. వారి బీదరికం ఇంట్లోవారికి గిట్టలేదు.

"ఈ భావం ఉన్నవారు ఆహ్వానాలు పంప కూడదు అనుకుంది."ఇంటికి తిరిగి వచ్చింది.

రెండవరోజు ఒకసారి స్నేహితురాలికి కనిపించాలని వెళ్లింది క్రాంతి.

"రావే క్రాంతీ! ఆయనగారేమో స్నేహితులతో వెళ్లారు. భోజనానికే వస్తానన్నారు. బోర్ కొడుతుంది." అన్నది రాధ. బంధువులెవరు లేనట్టున్నారు. ఇల్లు నిశబ్దంగా ఉంది.

"పేకాడదామా?"

"నీకు వచ్చా?"

"ఏదోకొద్దిగా..." ఇద్దరు పేక కలిపారు. అరగంట గడిచేసరికి, పేక విసిరికొట్టి, లేచింది రాధ

"ఏప్ ఫూల్! కొద్దిగా అంటూ చాంపియన్‌లా ఆడుతున్నావే."

వారు వద్దన కన్నా లోపలి నుండి రాధ,

తల్లి, అత్త మాటలు వినిపిస్తున్నాయి. వచ్చిన బహుమతుల మీద రన్నింగ్ కామెంటీ జరుగుతుంది. క్రాంతికి అక్కడ ఉండాలని లేదు.

''వస్తానే.'' లేచింది.

''రాధా! ఓ పది నిముషాలు ఇలా రావే. ఇంగ్లీషులో ఉన్నాయి కొన్ని పేర్లు. ఈ బహుమతుల లిస్ట్ రాసుకోవద్దు...'' మేనత్త పిలిచింది.

''రావే క్రాంతీ, ఈ పద్దులంటే బోర్. నువ్వు చెప్పు. చేయి పట్టి స్నేహితురాలిని లాక్కుపోయింది.

రాధ ఇచ్చినవారి పేరు ధర ఉజ్జాయింపుగా చెబుతుంది క్రాంతి పట్టిక తయారుచేస్తుంది.

''ఆ తోలు ముఖం సన్యాసి, రావుగారిచ్చాడా ఈ టీ సెట్టు! వాడి కూతురికి వెండి గ్లాసు ఇచ్చాము'' మేనత్త మూతి తిప్పింది.

''ఈ టీ సెట్టు ఖరీదు యెంత ఉంటుందే క్రాంతీ!'' రాధ అడిగింది.

''పాతిక రూపాయలన్నా ఉంటుంది...''

''ఇదిగో నమ్మాయ్ ఢిల్లీలో అంత ధర ఉంటుందేమో! ఇక్కడ రోడ్డు ప్రక్కన బోలెడున్నాయి. పదరూపాయలు రాయవే.''

''ప్రక్కింటి లలితమ్మ మిల్క్ బాయిలర్ ఇచ్చిందే. ముక్కున వేలుంచు కుందామే. ముగ్గురి కూతుళ్లకు మూడు వెండి కుంకుమ భరిణలిచ్చాము.''

''అసలు నువ్వు మాట్లాడకు వదినా, నాకు మండిపోతుంది. వెండి, బంగారం పెడితే మనది మనకు వస్తుందే అని నువ్వు కాదు కానుకలు ఇప్పించింది.'' రాధ తల్లి అన్నది. తల్లిని, అత్తను మందలిస్తుందేమోనని స్నేహితురాలివంక చూచింది. రాధకవేం వినిపించనట్టు, తను వెంట తీసుకువెళ్లే వస్తువులు ఏరి ప్రక్కన పెట్టుకుంటుంది.

క్రాంతికి గాభరాగా ఉంది. తన పెళ్లిలో చిన్న దిద్దుల జత కానుకగా ఇచ్చింది రాధ. ఇప్పుడెలా?

''ఈ తాజ్‌మహల్ బొమ్మ ఎవరిదో...''

'క్రాంతి శ్రీనివాస్'రాధ చటుక్కున చెప్పింది.

''ఊం...'' దాన్ని దూరంగా పెట్టింది ఆమె. మా అంతస్తుకు సరితూగదని నెట్టినట్టు అనుభూతి చెందింది క్రాంతి.

''మీరు...అమెరికాలో డెకొరేషన్‌కు చాలా ప్రాముఖ్యత ఇస్తారట. అందుకే ఈ బొమ్మ తెచ్చాను రాధా!'' అన్నది బిడియంగా.

''ఇప్పుడేమయిందే...అమ్మా! ఆ బొమ్మ నేను తీసుకువెళ్లే సామానులో పెట్టు.''

''దాని కాలు విరిగిపోయిందే రాధా.'' తల్లి అన్నది.

''విరిగింది ఇవ్వకూడదని తెలియదా క్రాంతీ!'' మేనత్త అడిగింది.

''లేదండీ...నేను స్వయంగా కొన్నాను.''

మరి యెట్లా విరిగింది? విరిగే వస్తువులు విరుగుతూనే ఉంటాయి. తీసుకువెళ్లి 'అమ్మాయి ఆడుకుంటుంది.'' ఆవిడ దాన్ని, విరిగిన కాలును చూపింది. క్రాంతి రాధవంక

చూచింది. ఆమె ఏం మాట్లాడలేదు.

క్రాంతికి భూమి కదిలినట్టు అనిపించింది. విరిగింది తాజ్‌మహల్ బొమ్మకాదు; ఆమె హృదయంలో స్నేహానికి కట్టుకున్న పవిత్రమైన గోపురం! రాధ అత్త తిరిగి ఇచ్చింది తాజ్‌మహల్ బొమ్మకాదు. ధనవంతుల తత్వానికి నిర్వచనము! ఆమె కళ్ళముందు యెంతో శ్రద్ధగా కూర్చుని ప్యాక్ చేసే భర్త కనిపించాడు. కానుక అంటే, కలకాలం తమను గుర్తుకు తెచ్చేవి, అభిమానానికి చిహ్నాలు! కాని అవి వ్యాపార సరళిలోకి దిగాయి. సగటు గంటకు ఒకరు అమెరికా వెడుతున్నారు. వేష, భాషలు మారినా, మారనిది ఇరుకయిన హృదయమేనేమో! సంస్కారము, సహృదయత లేని చదువులు యెందుకో? కానుకకు విలువ కట్టారు. కాని తను అంత దూరం నుండి వచ్చిన, ప్రేమాను రాగాలకు విలువ కట్టగలరా!

భర్త అపురూపంగా పేక్‌చేసిన బొమ్మను అపా, విస్తంగా పట్టుకుంది.

"ఉండనీయవే... నీకున్నది తెచ్చావ్!"

మొక్కపోయిన వస్తువులు కానుకలుగా తగవు." చటుక్కున తన చేతికి ఉన్న నీలం పొడి ఉంగరం తీసి రాధ చేతికి పెట్టింది.

"ఇప్పుడు ఇది యెందుకే?"

"నా గుర్తు ఏదయినా నీదగ్గరుండాలి" బలవంతంగా కన్నీరు అదిమి పట్టింది.

"అమ్మా చూడే" అత్త, తల్లి ముఖాలు వికసించాయి, వారి శ్రమకుఫలితం దక్కిందన్న ఉత్సాహము ముఖంలో కనిపించింది.

వస్తానే. బేబి లేచి ఉంటుంది."

"ఉండమ్మా వెళ్ళనుగాని. ప్రసాద్ రాగానే వడ్డించేస్తాను. నీ కూతురు అరిగిపోదులే" ఆ ఆప్యాయత వెగటుగా కనిపించింది.

"అమ్మ దగ్గర చేరిక లేదు దానికి వస్తాను." గబగబ బయటికి వచ్చింది. కళ్ళు ఒత్తుకుని రిక్షా మాట్లాడుకుంది.

తల్లి బేబిని యెత్తుకుని తిరుగుతుంది వరండాలో.

"వచ్చావా క్రాంతి! నీ కూతురు నన్ను ఏడుచెరువుల నీళ్ళు త్రాగిస్తుందే అమ్మా... తీసుకువెళ్ళిన కానుక మళ్ళీ తెచ్చావేమే!" అన్నది బేబినిచ్చి, కానుక అందుకుంటూ.

"అమ్మా! పేకేజ్ అదే. అది తాజ్‌మహల్ బొమ్మ. విరిగిందట. బేబికిచ్చేసింది రాధ."

"యెంత గొప్పవాళ్ళయినా ఇంత అందమయిన బొమ్మనిలా ఇచ్చుకుంటారే! ఉండు అతికించి బల్లమీద పెడతాను. పద భోజనం చేద్దువు.

"కడుపు నిండుగా ఉందమ్మా..." అన్నది. తల్లి రేడియో పెట్టింది. ఆర్. బాలసరస్వతి కంఠము తీయగా మధురంగా వినిపిస్తుంది. "సృష్టిలో తీయనిది స్నేహమేనోయీ!" చటుక్కున రేడియో ఆపింది.

"నీకా పాటంటే యెంతో ఇష్టం కదే!"

"పాటకు అర్థం మారిపోయిందమ్మా. "సృష్టిలో తీయనిది డబ్బు ఒక్కటే ...!" అన్నది, వేదాంతిలా. ఆమె కళ్ళముందు తొక్కుడు బిళ్ళలు, బొమ్మలాటలు, కోలాటాలు, ... యెన్నో గిర గిర తిరగాయి. ఒక్క సత్యం కళ్ళముందు నిల్చుంది. ప్రొద్దు పొడిచే దగ్గర తనుంటే, ప్రొద్దుగ్రుంకే దగ్గర రాధ ఉంది. మార్పు సహజమేనని సంతృప్తి పడింది.

"ఏమిటో, దీని వాలకం ఇది" తల్లి విసుక్కుంటూ వెళ్ళిపోయింది.

# డాక్టర్ సలహాలు

**వి. జి. కె.—అనకాపల్లి:**

నాకు గత ఆరు మాసములుగా చేయి వణకు చున్నది. గట్టిగా మాట్లాడితే కాళ్ళు వణకు పోవుచున్నవి. చిన్న వస్తువును సైతం జాగ్రత్తగా పట్టుకోవడం ఇబ్బందిగా ఉన్నది. వ్రాత స్పీడు తగ్గినది. ఈ వణుకు తగ్గుటకు సరిఅయిన మందులు తెలుప ప్రార్థన.

ఇలా జరగటం— నరముల బలహీనత, థైరాయిడ్ గ్రంధి ఎక్కువగా పనిచేయుటం వల్ల ఏర్పడే "థైరోటాక్సికోసిస్" అనే రోగంవల్ల అయి ఉండవచ్చును. వీటి కోసరం, నెత్తురు పరీక్ష 'బి. ఎం. ఆర్.' టెస్టు చేయించుకోవాలి.

రోగం నిర్ణయమయిన తర్వాత చికిత్స మొదలు పెడితే వెంటనె ఫలితం కనబడుతుంది. ఫలానా రోగం అయి ఉంటుంది— అని మందులు వాడితే —అవి బూడిదలో పోసిన పన్నీరు—లాగా వృధా అయ్యే అవకాశం, ఇంకా కొన్ని అదనపు రోగాలు రాగల అవకాశం ఉంది.

**కె. జె— తేజ్‌పూర్.**

నేను గర్భిణిని కాకముందు పొట్ట లావుగా వుండేది. అన్నానికి బదులు రొట్టెలు తిన్నా లావు ఏ మాత్రము తగ్గలేదు. ప్రసవం తరువాత పాపకు నాల్గవ నెల వచ్చినా లావు తగ్గలేదు. ఏదైనా మార్గము చెప్పండి.

పొట్ట లావుగా ఉండటం అనేది, ఒకసారి, వచ్చిన తర్వాత, తగ్గటం— చాలా కష్టం. కానీ, సన్నబడలగా తగ్గించుకోవాలనుకుంటే క్రమ పద్ధతిలో వ్యాయామం, ఆహారం మొదలయిన వాటి మీద శ్రద్ధ వహించాల్సి ఉంటుంది.

'అన్నం' మాని 'రొట్టెలు' తినటం— అనేది లాంఛన ప్రాయంగా, సహజంగా ప్రస్తుతం వినబడుతున్నదే ! అన్నం తినటానికి బదులు రొట్టెలనేవి ఎక్కువగా తినటంవల్ల—లావు తగ్గుతుందని అనుకోటం చాలా పొరపాటు.

**కె. యు— సికింద్రాబాద్.**

కాళ్లకు, చేతులకు, నడుము వద్ద, వీపుమీద సన్నగా కురుపులువలె వున్నవి. బాధ ఏమి లేదు. పెన్సిలిన్ ఇంజక్షన్‌లు వాడాను. రక్తపరీక్ష గూడా చేయించాను. ఏమి లోపములేదు. చాలా వికారముగా వున్నది. ఇవి రాకుండా ఉండటానికి సలహా ఇవ్వండి.

ఈ "కురుపు"లనే వాటిని ప్రత్యక్షంగా చూడకుండా— ఏ తెగకు చెందినవో నిర్ణయించటంకష్టం. కాని మీరు వ్రాసిన లక్షణాలనుబట్టి, అవి "విటమిన్ ఏ" లోపంవల్ల, వచ్చి ఉంటాయని నా అభిప్రాయం.

"అక్వోవిట్" ఇంజక్షన్లు—4 రోజులకు ఒకటి వంతున, 5 ఇంజక్షన్లు వరుసగా చేయించుకోవాలి. ఇవి గాకుండా, విటమిన్—ఎ అండ్ డి మాత్రలు (అడెక్సోలిన్) రోజుకి మూడు వంతున వాడితే క్రమంగా మీ కురుపులు తగ్గటం జరుగుతుంది.

**వై. ఎస్— మేడూరు.**

మా అమ్మగారికి 33 సం. లు ఆమె ఎడమచేతి మణికట్టు మీద ఒక కాయ కాసింది. డాక్టరుకు చూపిస్తే దానికి మందులేదు. ఆపరేషన్ చెయ్యాలన్నారు. మా అమ్మగారికి ఆపరేషన్ అంటేభయము. దీని గురించి మీ సలహా ఏమిటి ?

చేతి మణికట్టు మీద ఉన్న 'కాయ' లాంటిది— 'గాన్‌గ్లియాన్' అంటారు. దీనికి, శస్త్ర చికిత్స, తగినది. చాలా చిన్న 'ఆపరేషన్' అని చెప్పవలసి ఉంది. భయపడవలసిన అవసరంలేదు.

కొన్ని సమయాలలో నెప్పి ఎక్కువగా ఉన్నప్పుడు ఆ కాయలోకి—'కార్టిసోన్' ఇంజక్షన్ చేయుటంవల్ల, తాత్కాలికంగా ఉపశమనం కలిగించవచ్చు.

—డా. కె. వేంకటేశ్వరరావు

## ఇంటింటి చిట్కాలు

వి. కనకదుర్గ

★ దంచి జల్లెడపట్టిన మెత్తని ఉప్పు, మెత్తని బొగ్గుపొడి రెండూ సమాన భాగాలు, కొంచెం ముద్దహారతి కర్పూరం, ఈ మూడూ కలిపి రోజూ రెండుపూటలా పళ్ళు తోముకోండి.

★ పన్ను సలపరింతగా ఉన్నా చిగురు వాచినా మూడువేళలా గోరువెచ్చని నీటిలో ఉప్పువేసి కరగించి పుక్కిట పట్టండి. ఉపశమనం కలిగిస్తుంది.

★ పంటిబాధ మొదలవగానే కొంత మందికి దవడవాచి వారికి బాధగానూ, చూచేవారికి వికారంగానూ ఉంటుంది. అప్పుడు మెత్తని బట్టలో ఉప్పు మూటగట్టి, కుంపటిశగన ఉంచుతూ కాపు కాచుకోండి. ఎంతోబాధ తగ్గినట్లు ఉంటుంది.

★ ముదురురంగు బట్టలు తొలిసారి తడిపేటప్పుడు ఇలాచేస్తే రంగు పోతుందని భయం ఉండదు బకెట్‌లో నీళ్లలో కొంచెం ఉప్పువేసి కరగనిచ్చి ముదురురంగు బట్టలు తడపండి. తరువాత ఉతుకులకు సోప్ వాడవచ్చు.

## వారఫలం

మహేష్

9-5-1975 శుక్రవారంమొదలు
15-5-1975 గురువారం వరకు

**మేషం :—** వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. మిత్రులు సహాయం చేస్తారు. ప్రయాణాలు ఫలించగలవు. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృషభం:—** ఉద్యోగంలో శ్రమకలుగుతుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టంవస్తుంది. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. సాటివారిలో గౌరవం లభిస్తుంది.

**మిథునం:—** మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. రావలసిన డబ్బు అందుతుంది. వారం మధ్యలో అధిక వ్యయం జరుగుతుంది. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు లాభదాయకంగా ఉంటాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో శ్రమకు గురికాగలరు. విలాస వస్తువులు కొంటారు.

**కర్కాటకం:—** వృత్తిలో ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. సజ్జనసాంగత్యం లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. వారం ఆఖరులో కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. అధిక వ్యయం జరుగుతుంది.

**సింహం :—** అనుకూలమైన వార్తలను వింటారు. రావలసిన డబ్బు అందుతుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి.వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. మిత్రుల సహాయం లభించగలదు. స్త్రీలకు— పుణ్యకార్యాలు చేస్తారు. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**కన్య :—** చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. సంతోషకరమైన సమాచారం అందుతుంది.

**తుల:—** ఇతరులతో కలసి చేసే వ్యాపారాలు లాభిస్తాయి. సాటివారిలో గౌరవం బాగుంటుంది. వారం మధ్యలో అనవసరమైన వ్యయంచేస్తారు. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలుతిరిగి బాగుంటాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృశ్చికం :—** వ్యాపారంలో సాటివారి పోటీ పెరుగుతుంది. ప్రయాణాలు వాయిదాపడతాయి. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. వారం ఆఖరులో మీరు అనవసరమైన శ్రమకు గురికావలసి వస్తుంది. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. ఎవరితోను వాద ప్రతివాదాలు తగవు.

**ధనుస్సు :—** వృత్తిలో ఆదాయం బాగుంటుంది. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు. వారం ఆఖరులో మీ ప్రయత్నాలు సులువుగా నెరవేరతాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**మకరం :—** ఆర్థికవ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. వారం ఆఖరులో మీ కార్యక్రమాలకు మార్పులు రాగలవు. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. బంధువులకు సహాయం చేస్తారు.

**కుంభం :—** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. ముందుముందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధిస్తారు. స్త్రీలకు— సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. అనుకూలమైన వార్తలను వింటారు.

**మీనం:—** మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో సాటివారి పోటీ తగ్గుతుంది. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. నూతన విషయాలను తెల్సుకుంటారు.



# నటరాజు తాండవం ధర్మ పథం



బులుసు వెంకటరమణయ్య

పరమేశ్వరుడు నాట్య ప్రియుడు; నాట్యమున ఆయనకు సాటియైన దేవతలు వేరెవ్వరునూ లేరు. అందువల్లనే ఆయనకు 'నటరాజు' అనే పేరు సార్థకమయింది. ప్రదోషకాలంలో ఆయన తాండవాన్ని చూడడానికి దేవత లందరూ వచ్చేవారు. ప్రధానదేవత లందరూ ఆయననాట్యానికి హంగుదారులై ఉండేవారు. ఆ హంగుదారు లెవరో. ఎవరు ఏ వాద్యాలను ధ్వనింప జేశారో, ఎవరు తాండవానికి అనుగుణంగా గానం చేశారో చాలామందికి తెలియకపోవచ్చును. వాటినన్నింటినీ వివరించే శ్లోకం ఒక్కటి వున్నది.

ఆ శ్లోకం యిది—

'వాగ్దేవీ ధృతవల్లకీ శతముఖో
వేణుం దధత్ పద్మజః
తాలోన్నిద్రకరో రమా భగవతీ
గేయ ప్రయోగాన్వితా,
విష్ణుః సాంద్ర మృదంగ వాదనపటుః
దేవాః సమంతాత్ స్థితాః
సేవంతే తమను ప్రదోష సమయే
దేవం మృడానీ పతిమ్.'

దీని తాత్పర్యం యిది—

ప్రదోష సమయంలో – అంటే సాయం సమయంలో పరమశివుడు తాండవం చేస్తూ వున్నప్పుడు సరస్వతీదేవి తన కచ్ఛపీ వీణను ధరించి మీటసాగింది. దేవేంద్రుడు వేణువును ధరించాడు.

పూజ్యురాలైన లక్ష్మీదేవి పాట పాడినది. విష్ణుదేవుడు మృదంగాన్ని వాయించసాగినాడు. మిగిలిన దేవత లందరూ అన్నివైపులను ఉండి, మృడానీ పతియైన ఆ దేవుణ్ణి సేవిస్తూ, ఆ నాట్యాన్ని చూసి, ఆనందిస్తూ ఉండినారు.

దీనివల్ల తెలుస్తున్న దేమిటంటే—

దేవతలకు పరస్పరం ఐకమత్యం, పరస్పర సహకారం ఉన్నదని. వేర్వేరు మతాల సిద్ధాంతాలను పట్టుకుని ప్రేళ్లాడేవారికి వైరుధ్యం కనబడితే అది భ్రాంతిమూలకమైనదేకాని యదార్థమైనది కాదని గ్రహించాలి. శివకేశవు లిద్దరూ పరమాత్మ యొక్క సుగుణరూపాలని తెలుసుకోవాలి.

---

### ఆశ–హత్య

బెంగుళూరుకు చెందిన వో యువకుడు పూరు పొలిమేరదాటి తనకు పనివున్నదని వో ఆటో రిక్షా వ్యక్తికి కాస్త ఎక్కువ డబ్బు ఆశచూపి, ఆ ఆటోలో బెంగుళూరుకు 35 కిలో మీటర్ల దూరంలో వున్న హొసకోట అడవుల వైపు వెళ్లి అక్కడ ఆటోరిక్షా డ్రయివరును చంపి, ఆ ఆటోరిక్షా ఇంజను భాగాలన్నీ విప్పదీసుకుని బెంగుళూరుకు వెళ్లి బజారులో అమ్మ చూపాడట. అనుమానంమీద అతన్ని పోలీసులు ప్రశ్నిస్తే డొంకంతా కదిలిందట. ఆ ఆటోరిక్షా వ్యక్తి పేరు సుబ్బగణన్ అట.

### మద్రాసులో నీళ్ళ అమ్మకం!

మద్రాసులో 1700 గ్యాలనుల నీరు సుమారు పందరూపాయలకు అమ్ముతున్నారట. నీటికొరత వున్న ప్రదేశంలో వున్నవారు గ్రూపులు గ్రూపులుగా చేరి వో లారీడు నీళ్ళు (1700 గ్యాలనులు) కొనుక్కొని వాటిలోవారు పంపకాలు చేసుకోవాలట. ఈ విషయం కార్పొరేషను మేయరు అన్నారట. ఇప్పుడు రెండ్రోజులకోసారి నీరు వదుల్తున్నారట. మే నెలవస్తే యిహ మూడ్రోజులకోసారి అవుతుందట.

### వర్క్స్ మానేజర్ వస్త్రాపహరణం!

చాంద్‌విలిలో హిందూస్థాన్ ట్రాన్స్‌మిషన్ కంపెనీ పనివారు సమ్మె ప్రారంభించేసరికి యజమానులు లాకవుట్ చేశారట. దాంతో పనివారికి కోపంవచ్చి ఆ కంపెనీకి చెందిన వర్క్స్ మేనేజరు హేమంత్ అనే ఆయన ఆయనమిత్రుడూ కారులో వస్తూండగా వారి కారాపి, వారిని క్రిందికి లాగి, చితకబాది, అంతతో ఆగక వారి బట్టలు విప్పి ఆ బట్టలను, కారునూ తగలబెట్టారట.



### వచ్చే నవ్వు?

అలెగ్జాండరు మిచెల్ అనే ఒకాయన టెలివిజనులో వో హాస్య విషయం చెపుతూ ఆ విషయంలోని హాస్యానికి తానే తట్టుకోలేక నవ్వి ఇంకా నవ్వి 25నిముషాలు నవ్వి నవ్వి తాపునచనిపోయాడట.

### మాయమైన డబ్బు!

మునిసిపాలిటీ ఉపాధ్యాయులకు జీతాలిద్దామన్న సదుద్దేశంతో త్రివేండ్రం మునిసిపల్ ఆఫీసు అధికారులు ఏప్రియల్ ఏడోతేదీన 35 లక్షల, 25 వేల నాలుగొందల ఎనభైమూడు రూపాయలు బ్యాంకునుంచి తీస్తే, అందులో పదకొండువేల నాలుగొందల పదహారు రూపాయలు మాయమయ్యాయని, కనబట్టేదని మున్సిపల్ కమిషనర్ ఇబ్రహీంఖాన్‌గారు తెలియజేశారట. ఆ తర్వాత! తెలిలా!!

### బలవంతపు వేసెక్టమీ!

కుటుంబ నియంత్రణ ఆపరేషనులలో తమకు పెద్దస్థానం రావాలని, తమకు యిచ్చిన సంఖ్య (కచ్చితంగా యిన్నిచేసి తీరాలన్న సంఖ్య) పూర్తి చేయాలన్న కుతూహలంలో ఉత్తర భారత దేశంలోని కొన్ని రాష్ట్రాలు దారేపోయే వారిని పట్టుకుని బలవంతంగా ఆపరేషనులు చేస్తున్నారట. పెళ్లికూడా కానివారిని, నిండా పదిహేనేళ్లయినా లేని వారిని, అరవైయ్యేళ్లు దాటిపోయినవారిని, కనుపించిన వారినల్లా ఆసుపత్రికి లాక్కుపోయి శస్త్ర చికిత్సచేసి మరి వదలిపెడుతున్నారట. ఈ విషయాలన్నీ కేంద్ర ప్రభుత్వానికి తెలిసినట్టు తత్సంబంధ అధికారులు అన్నారట—విన్నారా!

### దారిద్ర్యాన్ని భరించలేక కన్నబిడ్డని అమ్ముకున్న తల్లి!

జోరహాత్‌లో ఒకామె దరిద్రబాధను భరించలేక, తనకేగాక తన పసికందు ఆర్నెలల పసిపాపకు కూడా తిండిలేకపోడాన్ని సహించలేక, తన పాపను రెండు రూపాయలకు అమ్మేసిందట. గత మూడురోజులుగా తనకు తిండిలేదని, భోజనంపెట్టిన, వారికి తన పసికందును యిచ్చేస్తానని ఆమెచేసిన ప్రకటన విని టీ ఎస్టేటులో పనిచేస్తున్న ఒకామె పిల్లకోసం తహతహలాడి, సమయానికి తనవద్ద ఆరెండ్రూపాయలు కూడా లేకపోయేసరికి తెగించి అప్పుచేసి, ఆపిల్లను తీసు కొనేసుకుందట—ఇది కథకాదు!!

సాయంకాలమైంది.

అవధాన్లుగారింట్లో నిశ్శబ్దంగా వుంది.

అవధాన్లు మధ్యాన్నం భోజనం కాంగానే వడవాలో ఉయ్యాల బల్లమీద పడుకుని రెండు గంటలు నిద్రపోవటం... లేవంగానే దొడ్లో పొదులు వగైరా గృహకార్యక్రమాలలో మరో రెండు గంటలు... ఊరివారి కష్ట సుఖాల చర్చ ముగించి రాత్రికి ఇల్లు చేరటం రోజు వారీ కార్యక్రమం.

ఆ రోజు అవధాన్లు సాయంకాలం కాంగానే రచ్చ బండదగ్గరకు వెళ్లిపొయ్యాడు.

అవధాన్లు విధవప్పగారు తల చెడిం దగ్గరనుంచీ తమ్ముడింట్లోనే వుంటున్నది. అప్పగారు సుబ్బమ్మ అంటే అవధాన్లుకి గౌరవము. పిసరంత భయభక్తులుకూడాను.

సుబ్బమ్మగారి దేహమేకాదు నోరుకూడా పెద్దదే.

సుబ్బమ్మగారు రాత్రి వంటకోసం స్నానం చేసి మడి కట్టుకోటానికి పెరటిలో బావి దగ్గర చిన్న గుడ్డముక్క చుట్టుకుని పదోసారి చాదతో నీళ్ల "కృష్ణ! కృష్ణ!" అంటూ నెత్తిన గుమ్మరించుకుంది.

అవధాన్లు ద్వితీయ కళత్రం శారద వంటింట్లో కూర తరుగుతున్నది.

అవధాన్లు ముగ్గురు పిల్లలు మూడు పనుల్లో వున్నారు.

క్రమబద్ధంగా పనులు జరిగే విషయంలో ముందు అవధాన్లు ఇంట్లోనే చూడాలి

హరి చదువుకోటానికి పంతులుగ ఇంటికి వెళ్లాడు. చదివేది అయిదవ తరగతి అయినా, ప్రయివేటు ఒక్కరోజూ మానడు.

విమల పక్కింటికి పెత్తనాలకు వెళ్లింది. వండటానికి మేనత్త పైపనులకు పిన్ని, అక్క వుండబట్టి యివతల చెంబు అవతల పెట్టే అవసరంలేదుమరి.

నీరద లాంతర్లు బుడ్డిదీపాలు ముగ్గుచిప్ప పాతగుడ్డ తీసుకుని తుడవటానికి కూర్చుంది.

పరధ్యాన్నంగా కొడికట్టిన దీపం బొడ్డు నలుపుతున్నది. కారణం... ఎవరూ వినకుండా అక్క చెవిలో ఏదో చెప్పి, అవతలికి జారు కున్నాడు హరి.



''అక్కా ! గోపీ సాయంత్రం నిన్ను కోవెలలో కలుసుకోమన్నాడు. ఎవరికీ చెప్పకు మీ అక్కకే అని కూడా చెప్పాడు. నీవు రాకపోతే తాను వచ్చినంత ఒట్టు.'' హరి అక్క చెవిలో చెప్పింది యీమాటే, విన్నదగ్గరనుంచీ పరధ్యానంగా యిప్పటివరకూ ఆలోచిస్తూనే వుంది నీరద.

గోపీని కలుసుకున్నట్లు తెలిస్తే యింట్లో వాళ్ల సంగతి అటువుంచి నలుగురు నాలుగు మాటలు ముఖాన అనేస్తారు, గోపీ పరాయివాడేం కాదు. చిన్నతనంలో కలసి చదివారు ఆడారు. కాని... ఈనాడు పెద్దవారయారనే పెద్ద అడ్డంకువుందే యిరువురిమధ్య ... ! ఎంత బలమైన స్నేహ మయినా వయసు రాక్షసిలాంటిది. వికటాట్టహాసం చేస్తుంది. విరుచుకు పడుతుంది. ఒక ఆడ ఒక మొగ స్నేహంలో వుండే...

దీర్ఘంగా ఆలోచిస్తూ దీపం బొడ్డు నలుము తున్న నీరద చటుక్కున తల ఎత్తింది.

''నాలుగురోజుల్లో మూడుముళ్లు పడి పరాయి ఇంటికి వెళ్లవలసినదానివి, ఎంత జాగ్రత్తగా వుండాలి ? ఆడపిల్లకు యింత పరధ్యానం పనికి రాదు. ఇందాకనుంచీ చూస్తున్నాను. అసలు సంధ్యవేళ ఏమిటా ఆలోచన ? పైగా నులిపిన బొడ్డే నలుపుతూ కూర్చుంటివి, అవతల చీకట్లు ముసురుతున్నాయి దీపాలు వెలిగించే వేళ దీర్ఘంగా మీనమేషాలు లెక్కపెడుతూ కూర్చోటం యీ ఇంట రాణులకే చెల్లింది. అందుకే పెద్దలు అదేదో సామెత చెప్పినట్లు చెప్పే పెట్టారు. దేనికయినా పెట్టిపుట్టాలి . హ్హా ..! ఎవరినాల్చిన పనే ముంది. దేముడు కొందరి ముఖాన ఆనందం మరి కొందరి ముఖాన దుఃఖం రాసిపెట్టి పెట్టాడు.''

సుబ్బమ్మ చంకన బిందె తడిబట్టతో నీళ్ళు కారుతూ గుమ్మంలో నుంచుని అనవలసిన నాలుగు మాటలూ అని ఓ చూపు గుమ్మంలోపల నుంచున్న శారదపై చూచి వంట గదిలోకి వెళ్లిపోయింది.

ఎదురు జవాబులు యివ్వటం నీరద తత్వం కాదు. ఎదురు చిన్నమాట అన్నా సుబ్బమ్మ వూరు కోదు. మరో పావుగంట పురాణం విప్పి వెళుతుంది.

గబగబ లాంతరు గ్లాసులు తుడచి కిరస నాయిలు డబ్బాకోసం గూటి దగ్గరకు వెళుతూ (పిన్నివైపు చూచింది.) సవతితల్లివైపు చూచింది. చేతిలో మల్లెపూలదండ పట్టుకుని నుంచున్న శారద ముఖం ముడుచుకుని వుంది. సరీగా కన పడటంలేదు కాని నల్లబడికూడా వుంటుంది

నీరద తనని చూడటం గమనించి. . ''నీరదా! యిదిగో చెండు '' అంది తన చేతితో పూలమాల చూపుతూ.

''చెయ్యి కడుక్కువస్తాను.'' కిరసనాయిలు డబ్బాలోంచి సీసాలోకి తోడుతూ అంది.

శారద పూలమాల పట్టుకుని అక్కడే నుంచుంది.

నీరద దీపాలు వెలిగించంగానే చెండు తీసుకుని తలలో పెట్టుకుంది. వంట గదిలోకి వెళుతున్న శారదను చూచి ... ''పిన్ని అని ఎలా పిలవను ? నాకన్నా యేడాది చిన్నది. తనను చూచి మొదట్లో బెరుకుగా వుండేది. తరువాత తరువాత బెరుకుతనం పోయి (నీరదా) పేరుపెట్టి పిలిచేటంత దగ్గ రయింది. తనుమటుకు అటు పేరుపెట్టి పిలవలేక పిన్ని అనలేక అలాగే రోజులు గడిపేస్తున్నది.'' నిట్టూర్పు విడుస్తూ అనుకుంది. అంతలో గోపీ విషయం గుర్తుకొచ్చింది.

తను కలుసుకోకపోతే గోపీ బాధపడతాడు. ఎలాగో ఓలాగు వెళ్లి ఇహ నిన్ను చూడటానికి రాను గోపీ ! అని చెప్పాలి కోవెలకు వెళ్లాలంటే, మంచి నీళ్లు తెచ్చే నెపంతో కరణంగారింటికి బైలుదేరితే మధ్యలో కోవెల దగ్గర ఆగవచ్చు.

నీరద ఓ నిశ్చయానికి వచ్చి వంట గదిలోకి వెళ్లింది.

''అత్తయ్యా ! మంచినీళ్ల బిందెలో సాలీడు వచ్చింది, ఓ బిందె మంచినీళ్లు తెస్తాను.'' అంది ఖాళీ బిందె చంకన పెట్టుకుని బైలుదేరుతూ.

సుబ్బమ్మ పొయ్యిలో కట్టెలు ఎగదోస్తూ ... ''ఒక్కపూట ఇంట్లో నీళ్లు తాగటానికి పీక పట్టు కుంటుంది. కాస్త చవ్వగా వుంటాయి. అంతేనా ?

**కొందరికి - ఎందరికో**

కొందరికి ఉంటాయి మిద్దెలు మేడలు
అందులో ఉండేవారు ఉన్నా లేకున్నా
ఎందరికో ఉండవు పూరిగుడిసెలైనా
అందులో ఉండేవారెందరో ఉన్నా
కొందరికి ఉంటాయి పంసినన్ని దుస్తులు
వారు ధరించేది సగం శరీరానికే అయినా
ఎందరికో ఉండవు చింపిరి పీలికలైనా
వారి వంటికి బట్టలు ఎంతో అవసరమైనా
కొందరికి ఉంటాయి విందులు కొల్లలుగా
ఆరగించడానికి వారికి ఆకలి ఉన్నా లేకున్నా,
ఎందరో ఉంటారు నిత్యం పస్తులు
మూడు పూటలా తిండి ఎంతో అవసరమున్నా
ఉన్నవారికే అన్నీ సమకూరడం
లేనివారి కేవీ అందకపోవడం
సృష్టిలోని మర్మమా
మానవ సృష్టియా ?

— ఎల్. మాలకొండయ్య

ప్రొద్దుపోయింది అంతదూరం ఆడపిల్లవు ఒంటరిగా వెళ్లటం. పోనీ విమలనన్నా వెంటబెట్టుకెళ్లు.'' అంది.

అప్పుడే గదిలో అడుగుపెట్టిన విమల ''ఎవ రితో మాట్లాడుతున్నావు అత్తయ్యా !'' అంది బలవంతాన నవ్వు దాచుకుంటూ.

నీరద వెళ్లిపోయినట్లు గ్రహించుకొని ... ''మనుషులతోకాదు. వాళ్లెట్లాగూ మాట్లాడరు. గోడలు, తలుపులు వాటితో.'' కోపంగా అంది సుబ్బమ్మ.

''కాలక్షేపమేకదా కావలసినది. ఎవరయితే నేమిలే'' అంటూ చల్లగా అవతలికి జారుకుంది.

''దాని వరస అట్లా దీని వరస యిట్లా హ్హా!'' అనుకుంది సుబ్బమ్మ యీతఫా లోలోపలే.

* * *

రంగనాయకుని కోవెల దగ్గరవుతూనే నీరద అడుగులు మెల్లిగా వేయటం మొదలుపెట్టింది.

కోవెలముందు ఆగి నలువైపులా ఓసా చూచింది. దారమ్మట ఎవరూ పోవటంలేదు తృప్తిగా ఓ నిట్టూర్పు విడచి లోపలికి ,అడుగ పెట్టింది.

మెట్లమీద కూర్చున్న గోపీ పరధ్యానంగ ఆకులు గిల్లుతున్నాడు.

చంకన వున్న బిందె మెట్టుమీద నెమ్మదిగా మెట్టుమీద పెట్టి ''గోపీ !'' అంది నీరద.

ఒక్క వుదుకున లేచి గబుక్కున నీరద రెండు చేతులు పట్టుకున్నాడు. గోపీ ముఖంలో అలసట ఆందోళన గూడుకట్టుకున్నాయి. భా రం గా ... ''నీరదా !'' అన్నాడు.

''ఏమయింది గోపీ ?'' మృదువుగా గోపీ చేతుల్లోంచి తన చేతులు తీసేసుకుంటూ అడిగింది.

''ఏం కావాలి నీరదా ! నీ పెళ్లి...నీపెళ్లి...''

ఆవేశంగా వూగిపోతున్న గోపీని చూచి మెల్లగా నవ్వింది.

''ఓ ... అదా ! అవును...పెళ్లి ... అవును గోపీ ! పెళ్లి అయితే యేమిటి ?''

విసుగ్గా ముఖంపెట్టి మెట్లమీద నిస్సహాయు డిలా కూర్చున్నాడు. వెంటనే దూకుడుగా ... ''పెళ్లి అహా...ఎంత ముచ్చటగా చెబుతున్నావ్ ! మీ నాన్నకు మీ పిన్నికి యిరవైయేళ్ల తేడా, నీకూ నీ కాబోయే పతిదేముడికి పాతికేళ్ల తేడా. మీ పిన్ని ఎంత సుఖపడుతుందో నీవూ అంతే సుఖపడతావు నీరదా అంతే...'' అన్నాడు.

''సుఖమంటే ఏమిటి గోపీ? సుఖానికి అర్థమే తెలియదు. ఇంకా సుఖం గురించి ఆలోచన ఎందుకు...? నాకు వూహ తెలిసినప్పటినుంచీ అమ్మని, బామ్మ అత్తయ్య నాన్నగారు ముగ్గురు మాటలతో బాధించటం తెలుసు. అమ్మ ఎన్నిసార్లో చాటుగా కన్నీరుకార్చటం తెలుసు. అమ్మ సుఖంగా కాపురంచేసి స్వర్గస్తురాలయిందని నలుగురూ అన్నారు...'' నీరద అంతవరకూ ఆవేశంతో చెప్పి చటుక్కున ఆగింది. మళ్లీ నెమ్మదిగా అంది... ''గోపీ ! మూడునెలల తమ్ముడిని వదలి అమ్మ వెళ్లిపోయింది. హరిని పెంచి పెద్దచేయటమే సుఖ మనుకున్నాను. నాన్నగారు ఎదురు కట్నం యిచ్చి పిన్నిని తీసుకొస్తున్నారంటే ... ఆ వచ్చే పిన్ని ఎన్నేళ్లదో అనుకున్నాను. నాకన్నా చిన్నవయసు పిన్ని వచ్చింది ... కోరిన నగలు చీరలు అదృష్టమే తల్లీ ఆడదాని అదృష్టం. మీ పిన్నికి సుఖపడే యోగం వుండి యీ ఇంట్లో అడుగుపెట్టింది'' అంటూ రోజుకు పదిసార్లు అత్తయ్య అంటూవుంటుంది. అదే నాకు తెలుసు. ఆడపిల్ల ఆపై ఆలోచించటం భావ్యంకాదు. నాన్నగారు ఒక్కమాట చెప్పారు. 'మీ పిన్నిని నేను సుఖపెట్టటంలేదూ ? అతనేం పరాయివాడా. స్వయానా మీ పిన్నికి పెద్ద అన్నగారు. అతనికి అసలు పెళ్లి చేసుకునే వుద్దేశ్యమే లేదుట. ఆ వున్న ఇద్దరు పిల్లలకు ఆడతోడు వుంటుంది అనిట. బోలెడు ఆస్తి వుంది. బాగా సుఖపడ తావు.' ఇదీ గోపీ నాన్నగారు చెప్పింది. ఇహ నాకంతా సుఖమే గోపీ అంతా సుఖమే...''

మరి కాసేపు వుంటే తన కన్నీళ్లు గోపీ

(31 వ పేజీ చూడండి)

సీరియల్

# శమంత - హేమంత

పి.వి.ఆర్. శివకుమార్

*(గత సంచిక తరువాయి)*

సాయంత్రం ఆరు గంటల వేళ. వరండాలో కూర్చుని, ఆలోచనల్లో మునిగిపోయి వుంది శమంత. ఆమె వొళ్లో, గాలికి రెప రెప లాడుతూ కొట్టు కుంటోంది, ఆ రోజే ఆనంద్ దగ్గర్నుంఛి వచ్చిన ఉత్తరం.

ఆలోచనల్లో వున్న ఆమె, ఆదిత్య రాకను గమనించనేలేదు.

"ఏమండీ!... ఏమండోయ్..." గట్టిగా అన్నాడు ఆదిత్య.

"ఆఁ! మీరా!" ఉలిక్కిపడింది శమంత.

"నేనేగానీ, ఏమిటంత దీర్ఘాలోచనలో పడ్డారు? నాన్నగారు లేరా యింట్లో?"

"లేరండీ! రండి. కూర్చోండి.

ఎవ్వరూ లేరు యింట్లో. తమ్ముళ్లు ఆడుకునేందుకు వెళ్లారు. పిన్ని, పక్కింటివాళ్లతో సినిమాకు వెళ్లింది. నాన్న — ఓ గంటలోగా వస్తానని, పక్క బజార్లోని స్నేహితుడితో కబుర్లకి వెళ్లారు. వచ్చేస్తారు, ఓ పావుగంటలో — చాలా సేపయింది వెళ్లి."

"అబ్బో! షికార్లు మొదలు పెట్టారన్నమాట. ఫర్వాలేదు!"

"ఏదో మీ దయవల్ల!"

"నాదేముందిలెండి.."

"కూర్చోండి. నిలబడే మాట్లాడుతున్నారు—" అంటూ లేచి నిలబడ్డ శమంత వొళ్లోంచి జారి క్రింద పడింది ఉత్తరం. దాన్ని అందుకుంటూ, యధాలాపంగా అంది: "యిదిగో! దీన్ని గురించే ఆలోచిస్తూ వుండిపోయాను."

"అలాగా! అంతగా ఆలోచింపజేస్తున్న వుత్తరం ... ఎవరి దగ్గర్నుంచండోయ్!" హాస్యంగా అడిగాడు ఆదిత్య, కుర్చీలో చతికిలబడుతూ.

"మామయ్య—ఆనంద్ దగ్గర్నుంచి!" అంది శమంత.

"ఆహాఁ! అనుకుంటూనేవున్నాన్లెండి. ."

"కానీ — మీరనుకునేవేవీ నిజంకావులెండి" కట్‌చేసింది శమంత, "నా ఆలోచనలన్నీ ఆవేదన వల్ల ఉద్భవించేవే తప్ప, ఆనందంవల్ల కాదు."

ఆ మాట లంటున్నప్పుడు ఆమె ముఖంలో కదిలిన బాధావీచికలకి ఆశ్చర్యం కల్గింది ఆదిత్యకు.

"ఏమిటీమెలో యింత బాధ? వాళ్ల మామయ్యని చేసుకోవటం నిజంగానే యిష్టంలేదా? ఎందుకు?'

"మళ్లీ నాన్న రాగానే అడుగుతారు, మామయ్య ఏం రాశాడంటూ. అది చెప్పగానే, మరి జవాబేం రాస్తున్నావంటూ మరో ప్రశ్న! ఎలా జవాబివ్వాలో, ఎన్నాళ్లిలా దాటెయ్యాలో అర్థంకావటంలేదు. అసలే ఆరోగ్యం బాగాలేకపోయిన ఆయన్ని యింకా బాధపెట్టవలసి వస్తోంది!

మామయ్య త్వరగా పెళ్లి చేసేసుకున్నా బాగున్ను! నాకీ బెడద వదిలిపోతుంది!" భారంగా అంది శమంత.

ఇంకా జోక్యం కలిగించుకోకుండా వుండలేక పోయాడు ఆదిత్య.

"ఎందుకండీ, అంత మధనపడిపోతున్నారు? మీకూ, అతనితో వివాహం యిష్టమేనని చెప్పారు మీ నాన్న?" అడిగాడు

"హుఁ! యిష్టం!..." నిట్టూర్చింది శమంత, "ఒకప్పుడిష్టమే! వ్యక్తిత్వానికి నిర్వచనమూ, ఆత్మగౌరవానికి విలువా తెలీని అమాయకపు రోజుల్లో! కానీ యివేళకూడా యిష్టపడుతున్నానని ఆయన భావిస్తున్నారంటే, అది ఖర్మ!"

"నా కర్థంకాలేదు—" నెమ్మదిగా అన్నాడు ఆదిత్య.

"వివరంగా చెప్తానుండండి" అక్కడే మరో కుర్చీలో కూర్చుని, మొదలుపెట్టింది శమంత.

"చిన్నప్పట్నుంచీ నాకు మామయ్యంటే యిష్టమైన మాట నిజమే! ఇద్దరం ఒక్క వూళ్లో పెరిగాం. కలిసి తిరిగాం. కలిసి ఆడుకునే వాళ్లం — పాడుకునేవాళ్లం. క్రమంగా ఆ చనువూ— అభిమానమూ బలపడ్డాయి—సహజం!

అయితే అప్పట్నుంచీ అతడిలో పురుషాహంకారమూ, అధికార ప్రవర్తనా యెక్కువే! కాకపోతే, మగవాడూ, మగడు కావల్సినవాడూ అన్న అభిప్రాయంతో అణిగివుండి, అతడౌనంటే ఔననీ, కాదంటే కాదనీ తలూపేదాన్ని నేను. అలాగే చలాయించుకు, నెగ్గుకుపోయేవాడు తను.

నేను కాలేజీలో చేరాను. మనసు పెరగ సాగింది— కాలేజీ వాతావరణమూ, చదువుతోపాటూ విషయ పరిజ్ఞానమూ పెంపొందసాగింది.

అప్పుడు కనిపించసాగాయి మనచుట్టూ వున్న సమస్యల ముళ్లకంచెలు! మన సంఘంలోని మూఢాచారపు సంకెళ్లు!

ఎంత చదివినా, ఎంత చేసినా ఆడది ఆడదే! ఆమె వ్యక్తిత్వానికో విలువ కాదుగదా, గుర్తింపు కూడా యివ్వటంలేదు మగవాళ్లు! అన్ని విషయాల్లోనూ — ఆఖరికి సంపాదనలో కూడా తమతో సమానమైన వాళ్లపై గూడా వారికి చిన్నచూపే!

తాము ఉద్యోగం చేస్తుంటే తమ వ్యక్తిత్వపు పరిధులు అనల్పంగా పెరిగిపోయినట్లు భావిస్తారు! తోటి స్త్రీలు — అఫ్‌కోర్స్, స్త్రీలననలు తోటివారుగా భావించటమే అరుదనుకోండి వాళ్లు — ఉద్యోగం చేస్తుంటే అసూయ! కుళ్లు!! అనుమానరోగం!!! ఆమె నెలాగైనా ఏడిపించాలనో, అవమానించాలనో ప్రయత్నాలు!

అప్పుడే నిశ్చయించుకున్నాను — ఆవిష్కరించుకున్న వ్యక్తిత్వానికి ఆటంకంవచ్చే విధంగా ఏనాడూ ప్రవర్తించకూడదనీ, ఆత్మహత్యే అంతకన్న మేలనీ! జీవచ్ఛవంలా మనసు చంపుకు బ్రతికేకన్న అదే మేలు కదూ!

కానీ ఈనాడు మన సమాజంలో అరవై శాతం స్త్రీలు చేస్తున్న పని అదే — వ్యక్తిత్వాన్నీ, ఆత్మగౌరవాన్నీ చంపుకునో, మర్చిపోయో బ్రతికెయ్యటం! మిగతా నలభై శాతానికీ అసలవంటూ వున్నాయనే, వుంటాయనే తెలియదు!

మామయ్య బి. ఇ. ప్యాసయ్యాడు నేనెంతో మురిసిపోయాను — అతడూ యిదేతరంవాడే గనుక, చదువుకున్నవాడే గనుక, అభిరుచులూ—ఆశయాలూ గూడా యీ తరానివే అయుండవచ్చునని.

అక్కడే నేను పొరబడ్డాను. ఈ తరంలో కూడా పురుషులింకా మారలేదనీ, ఎన్నోవిధాల ఆధునికులమనుకునే యువకులు కూడా చెంపలూ, జుట్టూ పెంచటమూ, బార్ల చుట్టూ తిరగటం వరకే ఎదిగారుతప్ప — పెళ్లనేసరికి వ్యక్తిత్వాల విషయం మరిచి 'డాడ్'ల వెనకే చేరతారనీ, స్త్రీలను బానిసలుగానూ, విలాస వస్తువులుగానే చూస్తారనీ, అప్పటికి గుర్తించలేదు! అయినా కష్టపడుతున్న స్త్రీలే యింకా మారనిదే—కష్టపెడుతున్న పురుషులెందుకు మారతారు!

ఏనాడైనా బానిసలు విప్లవం రగుల్చోల్సిందే, యజమానులు మారటం చూశామా చరిత్రలో! ఇప్పటి స్త్రీ—పురుష అనుబంధమూ అలాగే వుంది మరి!

బి. ఏ. పరీక్షలు రాసి యింటికెళ్లాను. మరో నెలరోజుల్లో మామయ్యకూడా వచ్చాడు, ఫైనలియర్ రాసి. అప్పుడే తొలిసారిగా పెళ్లి మాటలు కదిలాయి యింట్లో.

అప్పటికే మా కుటుంబం బాగా చితికిపోయింది. పిన్నికి ఖర్చుమీదేతప్ప ఆదాయంమీద దృష్టి తక్కువ. నాన్నగారి ఆరోగ్యం అప్పటికే దెబ్బతింది. ఆయన ఉద్యోగం మానివేశారు. పిల్లలంతా చిన్నవాళ్లు. వాళ్లు ఎదిగి, కుటుంబ బాధ్యత్ల స్వీకరించాలంటే ఏళ్లు పడుతుంది!

ఆ పరిస్థితుల్లో నన్ను విపరీతంగా అభిమానించే నాన్నగారిని వదిలి, పెళ్లిచేసుకు వెళ్లిపోవటంటే నాకు చాలా బాధగా అన్పించింది.

తను అన్ని కష్టాలూ పడీ, పిన్నిని ఎదిరించీ కోరి నరకాన్ని తెచ్చుకునీ మరీ చదివించారు నన్ను దేనికి? పెళ్లిచేసి, మరో యింటికి పంపెయ్యటానా

---

**జరిగిన కథ 3:** ధనలక్ష్మి కొడుకు ఆదిత్య డాక్టరు. శమంత తండ్రి బలరామయ్యా గారికి గుండె జబ్బు. ఆదిత్య వైద్యం ప్రారంభిస్తాడు. శమంత సంపాదనపై ఆధారపడాల్సి వచ్చినందుకు బాధపడుతూంటారు బలరామయ్యగారు మేనకోడలు శమంతను వివాహం చేసుకోవాలనుకుంటాడు ఆనంద్.

---

కేనా ? ఆయనందుకే చేశారేమోగానీ, నేనూ అంత మాత్రంగానే ప్రవర్తించదల్చుకోలేదు.

ఒక కొడుకుకీ, కూతురికైనా నాకూ ఎలాటి తేడా వుండదన్న విషయాన్ని ఋజువు పర్చదల్చాను.

ఉద్యోగంలో చేరాలనుకున్నాను — ఆర్థికంగా నాన్నగార్ని ఆదుకోవాలని !

ఆరోజు సాయంత్రం సినిమాకి వెళ్లినప్పుడు, మామయ్య నడిగాను — అదిరిపడ్డాడు మామయ్య !

"నీకు ఉద్యోగమెందుకు శమూ ! మా నాన్న గారి ఫ్రెండ్ ఒక పెద్ద ఫరమ్‌లో మేనేజర్ ! రేపు నా రిజల్ట్ రాగానే నేను వెళ్లి అక్కడ జాబ్‌లో చేరిపోవటం తథ్యం. ఆ వెంటనే గాకుమారిగార్ని పూలరథంలో..."

"స్టుపిడ్ ! ఏమిటి మామయ్యా నీ మాటలు ? నేను జీవిత సమస్యని చర్చిస్తుంటే ?" సీరియస్‌గా అన్నాను. నా మాటల్తో అతనూ సీరియస్ అయ్యాడు.

"సో వాట్ ? నువ్వు సినిమాల్లో కథానాయిక లాగా ముసలి తండ్రినీ, పిన్నినీ, పిల్లల్నీ కని పెట్టుకు ఉద్యోగంచేస్తూ వుండిపోతావా ?"

"ఉండిపోవటంకాదు. తమ్ముడెలాగూ కాలేజీకి వచ్చేశాడు ! మరో మూడేళ్లలో వాడికి డిగ్రీ వచ్చేస్తే, వాడే నాన్నని ఆదుకుంటాడు.

మనకీ యేమంత వయసు మించిపోలేదు. నా కిప్పుడింకా పందొమ్మిది ! స్త్రీల వివాహ వయో పరిమితిని గూడా పాతిక చేయాలనుకుంటోందిట ప్రభుత్వం. దానికి ముందరే చేయూత నిద్దాం మనం !"

నవ్వబోయాను. మామయ్య మొహం చూస్తే నవ్వు రాలేదు !

"స్టాప్ నాన్సెన్స్. ఇంకా మూడేళ్లు ఆగాలా ! ఇంపాసిబిల్. ఐనా, ఆడదాని సంపాదనమీద ఆధార పడి బ్రతికేటంత అధమ స్థాయిలో వున్నాడా బావ ! అడుగుతానుండు..."

"మామయ్యా !" నాకు అసహ్యంవేసింది అతని మాటలు వింటుంటే ! "అలా ఇల్లిటరేట్‌లా మాట్లాడక. జీవితంతో పోల్చిచూస్తే, అవసరాల తెరల్లోంచి తిలకిస్తే, మూడేళ్లో లెక్కలోకిరావు.

మూడు కాకపోతే నాలుగేళ్లు — అయినా ఆడ దాని సంపాదనకీ, మగాడి సంపాదనకీ తేడా ఏమి టసలు ? మేం సంపాదించే రూపాయికి విలువ అర్ధరూపాయేనా ? ఎందుకంత హీనంగా మాట్లాడతావ్ ?"

"ఆహ్హా ! ఆదర్శాలు కూడా నేర్చావన్నమాట ! గుడ్ ! అయితే చెప్తున్నా, విను

ఏది ఏమైనా యీ సమ్మర్లోగా మన పెళ్లి జరిగి తీరుతుంది. నిన్నింకా దూరంగా వదిలి నేనుండ లేను. (అది ప్రేమా ? భయమా ??)

తర్వాత నువ్‌గూడా ఉద్యోగం చెయ్యటం సర దాగా భావిస్తే, అక్కడే ఏదన్నా జాబ్ దొరికితే చేద్దాంగాని.

అంతే తప్ప, యిక్కడ, యీ అవసరాలకోసం వంటరిగా నువ్వు ఉద్యోగం చెయ్యటం నా కిష్టం లేదు" —

అంటే ? లగ్జరీలకోసం, తన పేరుకోసం అయితే నేను ఫాన్సీగా జాబ్ చెయ్యొచ్చునన్నమాట. కానీ, నా కుటుంబాన్ని కింత తిండికోసమూ, డబ్బు అవసరం కోసమూ ఉద్యోగం చేస్తే — అతను సహించడన్నమాట ! ఎంత స్వార్థం !

లగ్జరీకోసమూ, పేరుకోసమూ ఉద్యోగాలు చేసేవాళ్లు పెరిగిపోబట్టే, ఆడవాళ్లు సరిగ్గా పని చెయ్యరనీ, టైం వేస్ట్ చేస్తారనీ పేరు వచ్చింది ! నిరుద్యోగ సమస్యా పెరిగి, అత్యవసరంగా ఉద్యోగాల మీద ఆధారపడ్డవాళ్లకి ఉపాధీ కరువైపోతోంది.

ఏనాటికయినా నేను జాబంటూ చేస్తే అది అవసరాల కోసమే తప్ప — లగ్జరీకోసం ఛస్తే కానివ్వను.

అందుకే మామయ్యతో అన్నాను —

"క్షమించు మామయ్యా ! నువ్వు కాదన్నా, ఇప్పుడు నాన్నకోసం నేనుద్యోగం చెయ్యకా తప్పదు. రేపు మనింటికి వచ్చేశాక, నీ సరదాకోసం ఏ జాబ్‌లో న్నా చేరమన్నా చేరనూ చేరను."

అతనికి ఒళ్లు మండిపోయింది.

"సరే ! అదీ చూస్తా" — నంటూ మొహం తిప్పుకు బలవంతాన సినిమాలో మునిగిపోయాడు, అతి సీరియస్‌గా.

ఆ మర్నాడే నాన్నతో మాట్లాడాడు. నాన్న నన్ను పిల్చారు. మా యిద్దరికీ బాగా ఘర్షణ జరిగింది.

"ఏమైనా నే నిప్పుడే పెళ్లి చేసుకునేది లేదు. ఉద్యోగంలో చేరితీరతాను." అని ఖచ్చితంగా చెప్పే శాను. నన్ను లొంగదీసే శక్తి మా మామయ్యకీ లేదు— అనురాగం అడ్డుపడి, నాన్నా నన్ను లొంగదియ్యలేక పోయారు.

తర్వాత క్రమ క్రమంగా తెలిసిరాసాగింది — మామయ్య మనసు — ఉత్తరాల్లోనూ, మాటల్లోనూ.

అతడికి నామీదా, నా అందంమీదా విపరీతమైన మోజు ! కానీ స్త్రీమీదా, ఆమె వ్యక్తిత్వంమీదా విప రీతమైన నిరసన !

ఈ ఇరవైయవ శతాబ్ది లక్షణాలు ఒక్కటీ లేవు అతడిలో !

క్రమంగా నా కతడి ప్రేమమీద నమ్మకమున్నా, అతడిమీద విలువ తగ్గిపోయింది !

గత అయిదారు నెలలుగా నాన్న ఆరోగ్యం మరీ తగ్గిపోయింది. దాంతో ఆయన మరీ పోరటం ప్రారంభించారు — నన్ను పెళ్లి చేసుకోమని.

సరే, నాలుగు నెలల క్రితం — మళ్లీ పెళ్లి మాటలు (?) జరిగేయి.

పదివేలు కట్నమూ, యితర లాంఛనాలూ



యివ్వటానికి అంగీకరించారు నాన్న. తాతగారు – 'పన్నెండు వేలన్నా యివ్వాలి, బయట ఎన్నో సంబంధాలు పదిహేను, యిరవై వేలన్నా యిస్తామంటూ వస్తున్నాయి' అంటూ గొడవ చేసి, ఆఖరికి అంగీకరించారు!

త్వరలో తాంబూలాలు పుచ్చుకోవాలని నిశ్చయించుకు, వెళ్ళిపోయారు వాళ్ళు.

నాకు కల్గిన అసహ్యానికి మితిలేదు!

నాన్నగారి దగ్గర అయిదారు వేలకన్న డబ్బు లేదు నాకు పెళ్ళి – పదివేల కట్నంతో – చెయ్యాలంటే మరో అయిదారు వేలన్నా అప్పు చేసితీరాలి!

మామయ్యకీ, తాతగారికీ మా కుటుంబ పరిస్థితులు పూర్తిగా తెలుసు.

ఏ పరిస్థితుల్లో నేను ఉద్యోగం చేస్తున్నదీ తెలుసు. తెలిసీ, వాళ్ళు యేమడిగారో తెలుసా ఆరోజు–

"నాదగ్గర డబ్బులేదు. ఏ అప్పో, సప్పో చేసినా పదివేలకన్నా యివ్వలేన"ని నాన్న అంటే,

"అమ్మాయి యిన్నేళ్ళగా ఉద్యోగం చేస్తోంది. యేమాత్రమూ వెనకెయ్యలేదా?" అని!

వెనకేసుకోవటానికా నేను ఉద్యోగం చేస్తోంది?

కట్నంకోసం డబ్బు పోగేసుకు, ఆ డబ్బుతో మొగుణ్ణి కొనుక్కుందామనా నేను ఉద్యోగంలో చేరింది? అంతేనా వాళ్ళకి అర్థమయింది?

అంతే అయితే–అలాటి కుసంస్కారుల కొంపలో కాలు మోపాల్సిరావటం – ఎంత హేయం!

ఈ జన్మలో ఆ పనికి అంగీకరించలేను.

మామయ్య అసలు మనిషా? అతనికి వ్యక్తిత్వమన్నది ఏ కోశానైనా వుంటే, కట్నం తీసుకోవటానికి ఒప్పుకునేవాడేనా? పైగా, బేరాలూ, యిలాటి మాటలుకూడానా!!

నా మనసు పూర్తిగా విరిగిపోయింది.

'బోడి ప్రేమ. మనిషిమీద కాక, ఆకారంమీదా, పరిస్థితులవల్లా పుట్టుకొచ్చిన ఆ ప్రేమకి విలువుందా?

రేపీ ఆకారం పోగానే ఆ మోజూ పోదూ?

ఛీ... యింత ఆత్మగౌరవంలేని మనుషులతో కలియటం వాతరంకాదు–" అని నిశ్చయించుకున్నాను.

మర్నాడు వాళ్ళు వెళ్ళిపోయారు.

నాన్నకి ఉత్తరం వ్రాశారు – తాంబూలాలు పుచ్చుకోవటానికీ, ముహూర్తం నిశ్చయించుకోవటానికీ ఎప్పుడు రమ్మనేదీ తెలియజెయ్యమంటూ.

అప్పట్నుంచీ మొదలయింది సంఘర్షణ – నాన్నకీ, నాకూ మధ్య.

'ఈ పెళ్ళి నాకిష్టంలేద'ని తెగించిచెప్పేశాను.

కారణాలడిగారు తెల్లబోయిన నాన్న.

ఏం చెప్పను? ఎలా చెప్పను?

నేను అయిష్టపడుతున్న ఆ కారణాలు నాన్నకీ, ఆ తరంవాళ్ళందరికీ అతి తేలికైనవిగా, హాస్యాస్పదంగా కన్పిస్తాయి!

అందుకే, కారణం చెప్పకుండానే, నా తీవ్ర వ్యతిరిక్తతని వ్యక్తంచేశాను.

— నాన్న మండిపడ్డారు

తరుచుగా ఘర్షణ జరుగసాగింది.

ఒకసారయితే, తెగించి అడిగారుకూడా నాన్న— 'నీ మనసులో ఎవరయినా వుంటే చెప్పు'మంటూ.

'అటువంటి దేమీ లేదని' వెంటనే అన్నాను.

''మరి ఇంకేమిటి అయితే? కేవలం నన్నాదు కోవాలన్న పాడు బుద్ధేనా? అలా అయితే నా కింకా చావు ఎప్పటి కొస్తుందిరా దేవుడా!'' అంటూ ఉద్రేక పడిపోయారు ఆయన

ఆ రాత్రే ఆయనకు గుండె నొప్పి అధికంగా రావటమూ, నేను మీ దగ్గరకు పరుగెత్తుకు రావటమూ జరిగాయి.

ఈ మధ్య ఉత్తరాల్ను మరీ ఎక్కువయ్యాయి. వాళ్ల తొందర వాళ్లది, మరి మామయ్యకి వంటరిగా వుండటమూ, హోటలు కూడా పడటం లేదుట! వెంటనే పెళ్లి చేసి, పంపెయ్యాలని కోరిక!

నాకు అక్కడే ఒళ్ళు మండుతుంది మళ్లా!

పెళ్లి చేసుకునేది కేవలం వండిపెట్టటానికేనా? అలాగయితే, నాకు పెట్టే తిండి ఏ వంటలక్కకి పడేసినా వండిపెడుతుందిగా!

లేదా శుభ్రంగా వంట నేర్చుకు, వండుకు తినమనాలి! అంతేతప్ప, హోటలు కూడు అమరటం లేదని, పెళ్లి చేసుకోవాలా?

ఆ మాట ఎందుకూ అనటం? అది వింటే, చదువుకు, వ్యక్తిత్వం సంతరించుకు మనిషిగా బతుకుదామనుకునే యీ కాలపు యువతి ఎంత బాధ పడుతుందో ఎందుకు గ్రహించరు వీళ్లు?

ఏం, తోడులేని బ్రతుకు దుర్భరంగా వుంది— జంటగా జీవితం పంచుకుందుకు రమ్మని — హాయిగా ఆహ్వానిస్తే, పరువుకి భంగమౌతుందా? వంటకి వీలుగా లేదనీ, కొంపకి కాపలా లేదనీ అనటమెందుకూ?

మొన్న మామయ్యకి రాశేశాను — నాకీ పెళ్లి యిష్టం లేదనీ, యింకా కనీసం ఏడాది, ఏణ్ణార్థం దాకా నేను పెళ్లి చేసుకోననీ, అప్పటికయినా పెద్ద తమ్ముడు కుటుంబానికి చేయూత నీయగల్గితేనే ననీ!

దానికి వచ్చిన జవాబు — యిది!

ఏదో ఆల్టిమేటంలాగా వ్రాశాడు!

ఈ ఉత్తరం అందిన వారం రోజులలోగా మీ నాన్నగారు తాంబూలాలకి ముహూర్తం నిశ్చయించి పంపారా సరే, లేదా తనని మర్చిపోవచ్చునట!

అక్కడికి, యిక్కడెవరో గుర్తు పెట్టుకు బాధ పడిపోతున్నట్టు!

పూర్ ఫెలో..''

పేలవంగా నవ్వింది శమంత!

ముగ్ధంగా ఆమెనే చూస్తూ వుండిపోయాడు, శిలాప్రతిమలా, స్థాణువులా, ఆదిత్య!

అతడి కదంతా వాస్తవంలా అన్పించటంలేదు.

ఆనందాతిరేకంతో గొంతు మూగబోయింది. మనసు స్థానం తప్పినట్టు విపరీతంగా సంచలిస్తోంది!

అంతరాంతరాల్లో ఏదో గేయం కదులుతోంది— అతడి కత్యంత ప్రియమైన గేయం —

'నీవేనా నా కలలో నిలచి ..హృదయము కలవర పరచినదీ? నీవేనా???'

చెప్పుల చప్పుడుతో కదలిక కలిగిందతడిలో

''ఎంతసేపయింది బాబూ, వచ్చి? అలా వ్రక్కవీధిలోదాకా వెళ్లాను — కాస్త షికారుగా వుంటుందని'' అంటూ లోపలికి వచ్చారు బలరామయ్యగారు.

*   *   *

పడుకున్నాడన్న మాటేగానీ నిద్ర రావటంలేదు ఆదిత్యకు. నిద్ర పట్టించుకోవాలన్న ప్రయత్నమూ లేదు ఆలోచనలు ... ఆలోచనలు . ఆలోచనల్లోనే తేలిపోతున్నాడు. అవే అతడికి ఆనందాన్ని కల్గిస్తున్నాయి.

'ఇంతకాలంగా చూస్తున్నా, మాట్లాడుతున్నా, చనువుగా మెసలుతున్నా శమంతని ... ఆమెలోని అసలు మనిషిని ... గుర్తించనేలేకపోయాడన్న మాట తను!

నివురుగప్పినా నిప్పులా, నింతో నిశ్చలంగా, గుంభనగా దాగుంది స్వయం వ్యక్తిత్వం ఆమెలో!

ఇన్నాళ్లుగా యింత సన్నిహితంగా మెలుగుతున్నా, అది తనకు అంతుచిక్కనేలేదంటే — ఎంత చిన్నతనం పరిశోధనా పరిజ్ఞానానికి!

ఇలాగైతే యువతీ యువకులు పరస్పరం సదవగాహన పెంపొందించుకు, పరస్పర రాగ రంజితులైతేనే వివాహం చేసుకోవాలన్న తన అభిప్రాయానికి బలం ఎలా చేకూరుతుంది?

ఇంత వ్యవధిలో తను, ఆమెకు యింత దగ్గరగా మెసులుతూకూడా, ఏమీ గ్రహించలేకపోయాడే, అంటే యిక ప్రశ్నలు — సమాధానాలవల్లనే తప్ప, ప్రవర్తనల ద్వారా 'మనిషిలోని మనిషి'ని గుర్తించటం అసాధ్యమేనా?

లేక పరిస్థితుల్ని బట్టి ప్రవర్తనలూ వుంటాయి గనుక, శమంత చుట్టూవున్న వాతావరణమే ఆమెలోని వ్యక్తిత్వానికీ ముసుగుకప్పి వుంచుతోందా? అవసరమైతే ఆమె ఆ ముసుగుని, అదెంత వజ్ర కవచమైనా చీల్చుకురాగలదా?'

అన్నీ సంశయాలే అతడిలో.

'వాళ్ల మామయ్యను ఆమె వివాహ మాడదట! నచ్చజెప్పు బాబూ!' అంటూ బలరామయ్యగారడిగిన రోజు ఆదిత్య తనలో తనే కొంత మథనపడ్డాడు.

'ఆడపిల్లలకు వ్యక్తిత్వాలుండే దేశం కాదు తమది. తల్లిదండ్రులెవర్ని నిర్ణయిస్తే వాళ్లని, గుట్టు చప్పుడు కాకుండా అంగీకరించి, తాళి కట్టించుకు — కాపురానికి పోవల్సిందే!'

శమంతా అంతే చెయ్యాలని ఆయన ఉద్దేశ్యం!

ఆమెగూడా అంతే చేస్తుంది. కాకపోతే కొంత బెట్టు. అంతే! ఆయనే చెప్తున్నారుగా — ఆమెకూ యిష్టమే అని!

సరే, తనదేం పోయింది? తనూ ఓ మాట అంటే సరి — మీ మామయ్యనే చేసుకోరాదా — అంటూ.

సిగ్గుతో మెలికలు తిరిగిపోవచ్చు.

'ఏమిటి నాన్నగారూ, మీరు మరీనూ! నేనిప్పుడేం మామయ్యని చేసుకోనని ప్రతిజ్ఞ పూనానా? ఎందుకు అందరితోనూ చెబుతారు?' అంటూ తండ్రిమీద ఎగిరిపడి, తన అంగీకారం తెలియజేయవచ్చు.'

నవ్వుకున్నాడు పేలవంగా!

**నేను లేను**

అవకాశాలు జారిపోతుంటే  
ఆశలన్నీ చంపుకున్నాను.  
అర్ధాకలితో మాడాల్సి వచ్చినప్పుడు  
ఆకలినే చంపుకున్నాను.  
బాధ్యతలు పెరిగిపోతుంటే  
కోరికలన్నీ చంపుకున్నాను.  
సంఘం కోసం — సంఘంలో ఒకడిగా .  
సంతలో మేకలా - నేనుగా — నేను లేను!!

— యినమండ్ర రామకృష్ణ

కానీ జరిగినదంతా పూర్తిగా విరుద్ధంగా వుంది!

ఆమె అంత సీరియస్‌గా మాట్లాడితే, ఆమెకు ఆనంద్‌తో వివాహం యిష్టం లేకపోవటానికి కారణాలు మరోలా వూహించుకున్నాడు!

అతడి ఉద్యోగం ఆమెకు ఆనలేదో —

అతడు ఆమె కోరుకొనేటంత (?) అందగాడు కాడో — ఆమెకు వివాహం మీదకన్నా, ఉద్యోగంమీదా, స్వేచ్ఛాయుతమైన కన్నె జీవితం మీదా మోజు యింకా తగ్గలేదేమో,

యిలాగే అనుకున్నాడు తప్పితే —

ఆమె... ఆమె.. నిత్యమూ తన కలల్లో మెదిలే స్వప్నసుందరేననీ, తన ఊహా ఉద్యానాల్లో అనునిత్యమూ విరిసే కుసుమబాలేననీ, తన ఆశయాల మొయిల్లో నిరతమూ మెరిసే మెరుపుతీవేననీ — అవే — ఆ వ్యక్తిత్వ పరిమళాలే — ఆమె కిలాటి నిర్బంధ వివాహాలపట్ల వైముఖ్యతని కల్గిస్తున్నాయనీ గుర్తించలేకపోయాడు.

ఎంత దౌర్భాగ్యం!

కనీసం సమయం మించిపోకముందే, యిప్పటికైనా గుర్తించగల్గాడు — ఎంత అదృష్టం!'' సంతోషంగా అనుకున్నాడు.

'అతడి ప్రేమమీద నమ్మకమున్నా, అతడిమీద విలువ తగ్గిపోయింది!... అంత ఆత్మగౌరవం లేని వ్యక్తుల్ని నేను ఛస్తే చేసుకోను!...'

మళ్లీ మళ్లీ గుర్తుకు రాసాగాయి ఆమె మాటలు!

'నిజమైన ఆధునిక తరపు ప్రతినిధి శమంత! ఇటువంటి స్త్రీలను తను ఆధునిక రచనల్లో చదివాడు. ఊహల్లో వెదికాడు. కానీ. . నిజ జీవితంలో కూడా వుండకపోరనీ, తనకు తటస్థపడగలరనీ వూహా కూడా రాలేదు!

తనుకూడా — పెళ్లిచూపుల్లో గంగిరెద్దులా అలంకరించుకువచ్చి, గంగిరెద్దులాగే తలూపి పలుపు కట్టించుకునే యువతులతో వివాహానికి సుముఖుడు కాదు.

కానీ తన ఆశయాలకీ, ఆశలకీ అనుగుణమైన యువతి ఎక్కడ, ఎలా తటస్థపడుతుందో అర్థం కాక సతమత మౌతున్నాడు. అదే అన్వేషణలో వున్నా, ఎలాటి మార్గంలో అన్వేషణ సాగించాలో తెలియని ఆయోమయంలో వున్నాడు

(30వ పేజీ చూడండి)

## శోభన్ భవిష్యత్తు!!

1975 ఆరంభమే ఆశాజనకంగా, ఆనందంగా వున్నదనడానికి నిదర్శనం "దేవుడు చేసిన పెళ్లి" విజయం. ఆ చిత్రంలోని బుచ్చిబాబు పాత్రను బలేగా పోషించిన నిజాన్ని ప్రేక్షకులు ఒప్పుకొన్నారు. అయిదారు కేంద్రాలలో శతదినోత్సవం జరుపుకునే ప్రాప్తం దే. చే. పె. కి వుంది.

మారుతీ ప్రొడక్షన్స్ వారి "బాబు" శోభన్ నట జీవితంలో కొత్త కిరీటాన్ని అలంకరించగలదన్న శబ్దం పరిశ్రమలో, వినిపిస్తున్నది.

ఇక "బలిపీఠం" గూర్చి వేరే చెప్పనవసరం లేదు. సిల్వర్‌జూబ్లీని చవిచూచే అర్హత వున్నదిగా దాసరిచే రూపొందించబడింది.

తదనంతరం దర్శనమిచ్చే డి. వి. ఎస్. రాజు గారి "జీవనజ్యోతి" శోభన్‌కు మరింత ఖ్యాతిని తేగలదని అంటున్నారు. దర్శకుడు విశ్వనాథ్ అయె!

సమత ఆర్ట్స్ వారి "జేబుదొంగ" వెరైటీ శోభన్‌బాబును చూపించి, మాస్ హీరోగా పేరు బడిసే భాగ్యాన్ని ఆర్జించి పెడుతుంది.

పైన ఉదహరించిన చిత్రాలన్నీ ప్రేక్షకులకు వెరైటీ శోభన్‌బాబును పరిచయం చేస్తాయి. వైవిధ్యం వున్న పాత్రలను పోషిస్తున్నారు గాబట్టి, భవిష్యత్తు బంగారుమయం కాక తప్పదు.

ఆయన చిత్రాలకు దర్శకత్వం నిర్వహించే వాళ్లు మొనగాళ్లకు మొనగాళ్లు. ఆదుర్తి, విక్టరీ, విశ్వనాథ్, దాసరి ప్రజలకు ప్రీతిపాత్రమైన వ్యక్తులవడం, అట్టి గట్టివాళ్ల దర్శకత్వంలో శోభన్ పనిచెయ్యడం కీర్తి, ప్రతిష్ఠలను పెంచక మరేం చేస్తాయి?

"మిస్. జూలీ"గా
లక్ష్మి

# సినిమా

## సంపూర్ణ విజయము

శ్రీలక్ష్మి ప్రొడక్షన్స్ నిర్మించిన వర్ణ చిత్రం "దేవుడుచేసిన పెళ్లి" అయిదు కేంద్రాలలో వంద రోజులు ప్రదర్శింపబడింది. ఈ సంస్థ నిర్మించే చిత్రాలలో ఏదేని ప్రత్యేకత నాటి "రవుడీరాణి" దగ్గర్నుంచి వుంటూనే వున్నది. నిర్మాత పూర్ణచంద్రరావుకు సంపూర్ణ విజయాన్ని తెచ్చిపెట్టిన చిత్రం "దేవుడు చేసిన పెళ్లి"

ఇంత ప్రజాదరణను పొందిన చిత్రాన్ని తమిళ, కన్నడ భాషలలో నిర్మించే హక్కులను ప్రముఖ నిర్మాత విఠలాచార్య కుమారుడు బి. వి. శ్రీనివాస్ మళయాళ భాషలో అనువదించే అధికారాన్ని అసోసియేటడ్ ప్రొడ్యూసర్ పొందారు.

హిందీలో నిర్మించే వుద్దేశం పూర్ణచంద్రరావుకు వున్నట్టు ఆయన అన్నమాటల్లో పసిగట్టాను.

"దేవుడు చేసిన పెళ్లి" చిత్రం తాతినేని రామారావు అంతస్తును ఆకాశానికి పెంచింది.

## రాజధాని నగరంలో శోభన్

భాగ్య నగరంలో శోభన్‌బాబు చిత్రాల షూటింగులు జరిగే అవకాశాలు కనిపిస్తున్నాయి. ప్రముఖ ఛాయాగ్రహణ దర్శకుడు వెంకటరత్నం రంగుల్లో నిర్మిస్తున్న పల్లవి ఇంటర్నేషనల్‌వారి చిత్రం హైదరాబాదులో జరుగుతుంది.

"ఖయిదీ బాబాయ్" చిత్రాన్ని నిర్మించిన బాబుల్‌నాథ్ తీయబోయే వర్ణ చిత్రం షూటింగు కూడా భాగ్యనగరంలోనే జరిగే అవకాశం లేకపోలేదు.




## నమ్మా నమ్మకపో

★ కొన్ని మగసాలీళ్లు ఆడసాలీళ్ళను ఆకర్షించడానికి తమ గూటి దారాలమీద సంగీతం మీటుతాయి.

★ తేనెటీగలు వేసవిలో తమ తేనెపట్టును చల్లగా వుంచేందుకు తమ రెక్కలతో అందులో వున్న వేడిగాలిని బయటకు నెట్టి — 'ఎయిర్ కండిషన్డ్' చేసుకుంటాయి.

★ డిశంబరు 21 వ తేదీ సంవత్సరంలోని మిగతా రోజులుకన్న తక్కువ సమయం కలది.

★ ప్రముఖ సంగీత విద్వాంసుడు "బీథోవెన్" ప్రపంచ ప్రసిద్ధి చెందిన సంగీత రచనలు చేసినపుడు — ఆయనకు బ్రహ్మ చెముడుట?!

★ కోడిపెట్ట తన గుడ్డును పొదిగేటపుడు రోజూ అనేకసార్లు అటూ ఇటూ కదుపుతుంది. — సి. లక్ష్మి

## విశేషాలు

మన ముఖ్య పట్టణంలో చిత్ర నిర్మాణం అభివృద్ధి చెందే మంచి రోజులు త్వరలో వస్తాయి అన్న నమ్మకం శోభన్‌కు వున్నది

నిర్మాతలు ఎక్కడ షూటింగు అంటే, అక్కడికి వెళ్ళి పని చెయ్యడంలో తనకు ఎలాంటి అభ్యంతరము లేదు అని చెప్పే శోభన్‌బాబును నిర్మాతల పాలిట కల్పవృక్ష మనడం న్యాయ విరుద్ధం కాదనుకొంటాను

### ఉత్తరాల సంస్కారం

శోభన్‌బాబు యింటికి వెళ్ళాను ఆయన ఆఫీసు రూములో వేలమంది అభిమానుల ఉత్తరాలను చూశాను వచ్చే ప్రతి వుత్తరంలో సంస్కారం, సభ్యత కనిపిస్తుంది శ్రీయుతులు నాగేశ్వరరావు, రామారావు, కృష్ణ అభిమాన సంఘాలు కూడా శోభన్‌బాబుకు ఉత్తరాలు రాసి, ఆయన ఫోటోను తెప్పించుకొంటున్నారు

తనకు వచ్చే ప్రతి జాబుకు జవాబునిచ్చే అలవాటు శోభన్‌కు వున్నది ఆయన్ను అధికంగా అభిమానించే వారెవరన ఆడవాళ్ళు, చిన్నపిల్లలు

### లేఖల సారాంశం!

ప్రేమలేఖలు రాసేవాళ్ళు, అన్నయ్యా అని సంబోధించేవాళ్ళు రోజుకు పదిమంది అయినా ంటారన్ననిజం ఆయనకొచ్చే వుత్తరాలుతెలిపాయి

ప్రేక్షకులు సూచించే సలహాలకు ప్రాముఖ్యత నిచ్చే సద్గుణం శోభన్‌కు వుంది వాళ్ళ ఇష్టపడే పాత్రలను మాత్రమే పోషించే నిర్ణయాన్ని ఆయన ఎప్పుడో తీసుకొన్నారు

రాబోయే రోజుల్లో శోభన్ రాజయోగాన్ని అనుభవించగలడన్న నమ్మకం నాకున్నది

### సెట్టు మూడు లక్షలు

ఈ మధ్య ఏ వి ఎమ్ స్టుడియోకు వెళ్ళాను మొదటి ఫ్లోర్‌లో విజయభట్ మూవీస్ వర్ణచిత్రం షూటింగు జరిగిన సెట్టును చూశాను నా మతి పోయింది ఎంత అందమైన భవంతి, ఎంత ఆకర్షణీయంగా వున్నదనుకొన్నారు సెట్టుకాస్టు మూడు లక్షలు అని తెలిసింది

ఆ సెట్లో పక్షం రోజులపాటు షూటింగు జరిగింది ఎనిమిది రీళ్ల చిత్రం వచ్చింది

ఈ చిత్రంలో శోభన్ ద్విపాత్రాభినయం ప్రత్యేక ఆకర్షణ కాగలదు ఘనకీర్తి వహించిన ఆదుర్తి దర్శకత్వంలో శోభన్ హీరోగా నటిస్తున్న మొదటి చిత్రం కూడా యిదే.

ఈ చిత్రానికి సత్యానంద్ రచనను, మహదేవన్ సంగీతాన్ని, కన్నప్ప ఛాయను, జి. వి. సుబ్బారావు కళను, కూర్పును ఆదుర్తి హరనాథ్, సహకార దర్శకత్వాన్ని కె. వి. రావు నిర్వహిస్తున్నారు.

ప్రధాన తారాగణంలో మంజుల, అంజలీదేవి, కృష్ణకుమారి, జయమాలిని, కాంతారావు, ప్రభాకర రెడ్డి, ధూళిపాళ, రావి కొండలరావు, మాడా వున్నారు. అన్నపూర్ణ విడుదల.

"లంఘ" హిందీ చిత్రంలో సుచిత్రా సేన్



నవచిత్ర ఎంటర్‌ప్రైజెస్

# రక్త సంబంధాలు

ఈస్ట్‌మన్ కలర్

## దర్శకత్వం: యం. మల్లికార్జునరావు

డైరెక్టర్ ఆఫ్ ఫోటోగ్రఫీ: వి.యస్.ఆర్. స్వామి W.I.C.A.,

కథ-మాటలు: మహారథి సంగీతం: సత్యం

కూర్పు: కోటగిరి గోపాలరావు

కళ: కళాకార్



# సినిమా

### వైగై డామ్‌లో శోభన్ - శారదలతో దృశ్యాలు

మదరాసులో సూర్యుని వగ ఎక్కువగా వుండడం వల్ల, శీతలంగా వుండే ప్రదేశాలలో మన నిర్మాతలు పాటల చిత్రీకరణ చేయిస్తున్నారు.

రవిశంకర్ ఆర్ట్ పిక్చర్స్‌వారి "బలిపీఠం" వర్ణ చిత్రం యొక్క రెండు ప్రేమగీతాల చిత్రీకరణ వైగై డామ్‌లో జరిగింది.

అరుణ, భాస్కరరావు పాత్రధారులగు శారద, శోభన్‌బాబు వైగైలో మూడు రోజులు ప్రేమ విహారం జరిపారు.

"చందమామ రావె, జాబిల్లి రావె" అంటూ ఒక పాట; "కుశలమా" అంటూ మరొక పాట యిద్దరూ పరస్పర అనురాగ మనస్కులై పాడారు.

ఈ రెండు పాటల చిత్రీకరణతో "బలిపీఠం" నిర్మాణం పూర్తయినట్టే, అన్నారు నిర్మాత మురళీ. ఈ చిత్రానికి దాసరి ప్రత్యేక శ్రద్ధ తీసుకున్న విజాన్ని ప్రేక్షకులు పసిగట్టగలరు.

శోభన్, శారద కలిసి నటించే చిత్రాలకు పరాజయం వుండదని నిరూపించే మరొక మాణిక్యం యీ "బలిపీఠం." ఎమ్. శేషగిరిరావు సమర్పకుడు; నవయుగ విడుదల.

### మెర్కారాలో జగపతి.

డార్జిలింగ్‌లో అనువయిన లొకేషన్లు లభించనందువల్ల, జగపతి అధినేత రాజేంద్రప్రసాద్‌గారు "పిచ్చిమారాజు" వర్ణ చిత్రం షూటింగును మెర్కారాలో జరిపారు.

మొదటి షెడ్యూలు ఏప్రిల్ 17 నుండి 25 వరకు జరిగింది. మూడు పాటల చిత్రీకరణ, కొన్ని ముఖ్య సన్నివేశాల చిత్రీకరణ మెర్కారాలో జరిగింది.

బ్యూటీ కింగ్ శోభన్‌బాబు వెరైటీ పాత్రను పోషిస్తున్న "పిచ్చిమారాజు" చిత్రానికి ఎస్. వెంకటరత్నం, మహదేవన్, సంజీవి, కృష్ణారావు వంటి మేధావులు సాంకేతిక శాఖలకు అధిపత్యం వహిస్తున్నారు.

గ్లామర్ క్వీన్ మంజుల మరొకసారి తన ట్యాలెంటును చూపెట్టే పాత్రను పోషిస్తున్న ఈ చిత్రంలో రాజబాబు ఒక గమ్మత్తయిన భూమికను ధరిస్తున్నారు.

ఈ చిత్రానికి సత్యానంద్ రచయిత. సినిమా అనువాదాన్ని, దర్శకత్వాన్ని వి. బి. రాజేంద్రప్రసాద్ నిర్వహిస్తున్నారు.

పాటలన్నీ "దసరాబుల్లోడు" స్థాయిలో వున్నాయి.

### బెంగుళూరులో వాణిశ్రీ మకాం

ప్రపంచ తెలుగు మహాసభలకు హాజరైన అదే రాత్రి, వాణిశ్రీ మదరాసుకు వెళ్లి, 'మాయా మచ్ఛీంద్ర' షూటింగును పూర్తిచేసి అదేనాటి సాయంత్రం బెంగుళూరుకు "పూజ" షూటింగు నిమిత్తం ప్రయాణం అయ్యింది.

ఏ. వి. ఎమ్. ప్రొడక్షన్స్ రంగుల్లో నిర్మిస్తున్న "పూజ" చిత్రంకోసం వాణిశ్రీ యిరవై అయిదు రోజులు బెంగుళూరు కంఠీరవా స్టుడియోలో మకాం పెట్టింది.

వరుసగా ఇన్నిరోజులు యివ్వడంతో, "పూజ" షూటింగు కార్యక్రమం, డబ్బింగ్ వ్యవహారం పూర్తవుతున్నది. దర్శకద్వయం కుమరన్, మురుగన్‌గార్లు వాణిశ్రీ సహకారాన్ని అభినందించారు.



ప్రపంచ తెలుగు మహాసభలలో పాల్గొన్న నటసామ్రాట్, నటరత్న, విద్యామంత్రి శ్రీ మండలికూడా క్రిందిచిత్రంలో వున్నారు.

## అప్పుడు కృష్ణవేణి, ఇప్పుడు లక్ష్మి

గత ఏడు వాణిశ్రీ నటించిన కృష్ణవేణి పాత్ర ఎన్ని అవార్డులను తెచ్చిపెట్టిందో ప్రేక్షకులకు తెలియనిదికాదు.

ఈ ఏడు అంతే పేరును తేగల పాత్రను డి. వి. ఎస్. రాజుగారి "జీవనజ్యోతి" చిత్రంలో పోషించింది.

అతి క్లిష్టమైన లక్ష్మి పాత్రను అందరూ యిష్టపడేవిధంగా వాణిశ్రీ పోషించింది. "లక్ష్మి పాత్రను విఖ్యాత దర్శకుడు విశ్వనాథ్ అపురూపంగా మలచారు" అని, ఆయన ప్రతిభా ప్రాభవాల విశిష్టతను వేనోళ్ల కొనియాడింది అగ్రనటి.

"జీవనజ్యోతి" చిత్రం ప్రతి పౌరుడు చూడదగిన వుత్తమ అంశాలను గొనియున్నది అని కొందరంటే, స్త్రీలను విశేషంగా ఆకట్టుకొనగలదని మరికొందరు అంటే, సంగీత ప్రియులను విపరీతంగా ఆకర్షించగలదని యింకొందరు అంటే, విద్యార్థిలోకాన్ని ఫిదా చెయ్యగలదని మరెందరో అంటున్నదాన్ని బట్టి ఆలోచిస్తే 1975 లో అగ్రస్థానాన్ని యిదే ఆక్రమించగలదేమో అనిపిస్తుంది.

ఈ చిత్రంలో అందాల శోభన్ నటన హైలైట్ అంటున్నారు. సహాయ పాత్రలను సత్యనారాయణ, శుభ, అల్లు రామలింగయ్య, నిర్మల పోషించారు. రాజబాబు – రమాప్రభల హాస్యం కడుపుబ్బ నవ్వించగలదు.

ప్రేక్షకులు పెట్టుకున్న ఆశలకు అనుగుణంగా "జీవనజ్యోతి" రూపం అందుకొని యున్నది.

## అనిల్ చిత్రానికి నారాయణరెడ్డి పాట

ప్రణయ గీతాలను లిఖించడంలో నారాయణరెడ్డి ఒరవడి ప్రత్యేకంగా వుంటుంది. పసందుగానూ వుంటుంది. అందుకు నిదర్శనంగా ఇటీవల వారు అనిల్ ప్రొడక్షన్స్‌వారి కలర్ చిత్రం "సంసారం"కు గానూ ఓ ప్రేమ గీతాన్ని వ్రాశారు ఇలా.

"ఒంటరిగా వున్నాము. మనమిద్దరమే వున్నాము<br>
ఉలకవెందుకు — పలకవెందుకు<br>
బిడియమెందుకు — వలపు విందుకు<br>
కలిసిపోదాము... రా... రా..."

ప్రేమపక్షులు జయసుధ, శేఖర్ (న్యూఫేస్) ప్రేమించుకున్నారు. పక్కనవద్ద ప్రేమ వలపు గీతాలకు దారితీసింది. అందుకే పై ప్రణయగీతాన్ని పాడుకున్నారు. పారవశ్యంలో మునిగిపోయారు. వారిరువురి మైమరపు పాటను సుందర ప్రదేశాల్లో చిత్రీకరించారు దర్శకులు తాతినేని ప్రకాశరావుగారు.

తప్పు చెయ్యని మనిషంటూ వుండడు. కానీ చేసిన తప్పుకు పశ్చాత్తాపపడి, సక్రమంగా నడచుకోవడంలోనే దైవత్వముంది అనే అంశంపై అల్లబడిన కథే "సంసారం" చిత్రం. ఈ చిత్రానికి టి. ఎల్. వి. ప్రసాద్ ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్.

నటరత్న ఎన్. టి. రామారావు, జగ్గయ్య, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, అల్లు రామలింగయ్య, రావి కొండలరావు, రావుంఢ్డీ, జమున, రోజారమణి, పుష్పకుమారి, ముఖ్య పాత్రలను పోషించారీచిత్రంలో.



ప్రపంచ తెలుగు మహాసభలలో పాల్గొన్న సినిమా తారలు : శోభన్, వాణిశ్రీ, అంజలి, జమున, ప్రభృతులు

## సత్యం సారథ్యం !

ఈమధ్య ఆంధ్ర దేశంలో ఏ వూరు వెళ్లినా రెండు పాటలు మాత్రం పదే పదే వినిపించాయి. ఆ రెండింటికీ సత్యం రాగాలను పొదిగారు. ఆ పాటలు యేమిటంటే. "నోము" చిత్రంలో సుశీల — బాలు పాడిన — కలిసే కళ్లలోన ... విరిసే పూలవాన; "నిప్పులాంటి మనిషి" చిత్రంలో బాలు ఆలాపించిన 'స్నేహమే నా జీవితం' అనెడి పాటలు.

ఈ సంతోష వార్తను, సత్యానికి తెలియ చేద్దామని, ఆయన యింటికి వరుసగా మూడు రోజులు ప్రయత్నించాము. ఆయన దొరకడాయె !

దొరకని కారణం పాఠకులకు తెలపాలిగా. ప్రస్తుతం సత్యం పది చిత్రాలకు సంగీత సారథ్యం వహిస్తున్నారు. "రక్తసంబంధాలు, రక్తపాశం, అనంతలక్ష్మి కంబైన్స్, శ్రీ విజయలక్ష్మి నరసింహా ప్రొడక్షన్స్, లక్ష్మీనరసింహా ఫిలింస్, శ్రీ గౌతమ్ ప్రొడక్షన్స్, రవి చిత్ర, సృజన చిత్ర, సి. వి. రమణ చిత్రం" గాక మరో నాలుగింటికి సంగీతం సమకూర్చడానికి అంగీకరించారు.

శ్రోతలకు నచ్చిన సంగీత దర్శకులు ముగ్గురే. వారిలో సత్యం ఒకరు.

## పి. సి. రెడ్డికి పాత పేరు

ఒకే ఏడు మూడు హిట్ చిత్రాలకు దర్శకత్వం వహించిన పి. చంద్రశేఖరరెడ్డి తరువాతి చిత్రాలలో పెద్దగా పేరును ఆర్జించలేక పోయినందుకు బాధ పడ్డవాళ్లు ఎందరో వున్నారు. అలా బాధపడిన వాళ్లకు వుపశాంతిని కలిగించింది, "పుట్టింటి గౌరవం" చిత్రం. డైరెక్షన్ బాగున్నది అని అందరూ అంగీకరించారు.

రాబోయే చిత్రాలలో రెడ్డికి పాత పేరును తెచ్చిపెట్టేవి మూడు వున్నాయి. "ఒకటి కొత్త కాపురం. రెండు బ్రతుకే ఒక పండుగ. మూడు జన్మజన్మల బంధం".

"కొత్త కాపురం"లో భారతి, కృష్ణ



## సినిమా

### రామానాయుడి అయిదు చిత్రాలు

"అమ్మాయిల శపథం" చిత్రం అతి త్వరలో విడుదల కాగలదని సురేష్ అధినేత చెప్పారు. ఆయన బీరువాలో అయిదు చిత్రాలకు సంబంధించిన స్క్రిప్టులువున్న నిజాన్నికళ్ళారాచూశాను. అవివీవన.

"ఒకటి సెక్రటరి; రెండు శాంతినికేతన్; మూడు ఒక చల్లని రాత్రి; నాలుగు సోగ్గాడు; అయిదు ఒక జానపదం.

### ఫిలిం ఫాన్స్ బ్యాలట్ ఫలితాలు

ఆంధ్రప్రదేశ్ ఫిలిం ఫాన్స్ అసోసియేషన్ అధ్వర్యాన జరిగిన ఫిలిం బ్యాలట్‌లో 1974 వ సంవత్సరానికి ఈ క్రిందివారు "ఉత్తములుగా" ఎన్నికైనారు.

ఉత్తమ చిత్రం — "అల్లూరి సీతారామ రాజు", దర్శకుడు కె. విశ్వనాథ్, రచయిత—దాసరి నారాయణరావు, సంగీత దర్శకుడు — కె. వి. మహా దేవన్. నటుడు — శోభన్‌బాబు, నటి — వాణిశ్రీ, క్యారెక్టర్ యాక్టర్ — సత్యనారాయణ, హాస్య నటుడు—రాజబాబు, విలన్—ప్రభాకరరెడ్డి, సహాయ నటుడు — చంద్రమోహన్, సహాయ నటి — రోజా రమణి, ప్లేబ్యాక్ గాయకుడు — ఎస్. పి. బాల సుబ్రహ్మణ్యం, గాయని—ఎస్.జానకి, ఫొటోగ్రాఫర్—వి ఎస్ ఆర్ స్వామి, కొత్త నటుడు — దేవదాసు కొత్త నటి—ప్రభ, బాలనటుడు మాస్టర్ టిటూ

— శ్రీనివాస్

ప్రపంచ తెలుగు మహాసభలో సన్మానింపబడిన తారలలో శ్రీమతి సావిత్రి శ్రీమతి లక్ష్మీరాజ్యం వున్నారు

'బాబు'లో లక్ష్మి

## శమంత — హేమంత

(23 వ పేజీ తరువాయి)

వుండి, ఎలాటి దుర్గుణాలూ లేకుండా — వున్నాడు

కట్నాలు కోరటం అతి సామాన్య విషయమే యీనాడు!

భార్యల్ని ఉద్యోగాలు చేయవద్దని శాసించటమూ మామూలు విషయమే యీ దౌర్భాగ్య సమాజంలో!

ఇటువంటి విషయాలను దృష్టిలో వుంచు కొని, అతణ్ణి తిరస్కరించ గలిగిందంటే —

శమంత యీ తరపు యువతి కాదు - ముందు తరంలో పుట్టవల్సింది — రేపటి మనిషి

అన్వేషణ ముగిసిందన్నట్లుగా, అలసట తీర్చు కొంటూ నిద్రలోకి జారిపోయాడు ఆదిత్య

*10*

ఆ రోజు ఆదిత్యతో మనసు విప్పి మాట్లాడి నప్పటి నుంచీ శమంత మనసు మనసులో వుండటం లేదు తను తొందరపడి, పరాయి వ్యక్తి ముందు మనసు పరిచేశానా అని కొంతసేపు, ఫర్వాలేదు అతడంత పరాయివాడేం కాదు — ఆ మాత్రం చెప్పుకోదగ్గవాడేనని మరికొంతసేపూ — ఆలో చిస్తోంది

"అసలు హేమయ్యని తిరస్కరించటం మంచి పనేనా? మేనమామగా అతడికి తనమీదా, తండ్రి మీదా అభిమానం అధికమన్నమాట వాస్తవమే! తను అతడిని చేసుకుంటే తండ్రికి చాలా మనశ్శాంతి! సంతోషం!

కానీ తను? తన మనశ్శాంతి మాట? తన ఆనందం మాట? ఎలా వంచించుకోగలదు తనని తాను?

ఒకప్పుడు అనుకున్నట్లే, మనసు ఎదిగిన యీనాడూ అతడిని భర్తగా అనుకోవటం అంత తేలికా?

అనుక్షణం ఆడదానికసలు వ్యక్తిత్వమే లేదన్నట్లు ప్రవర్తించే అతడికీ, ఆత్మగౌరవం నిల బెట్టుకోవాలని ప్రాకులాడే తనకూ ఎక్కడ కుదరాలి పొత్తు?

ఉహూఁ లాభం లేదు అనవసరంగా అతణ్ణి జీవితంలోకి ఆహ్వానించి — యిరువురి జీవితాల్ని నరకం చేసుకోవటం పూర్తిగా తెలివి తక్కువదనం! తన వల్ల కాదు

తన కసలిప్పట్లో వివాహమూ యిష్టం లేదు తమ్ముళ్ళు యింకా ఎదిగిరాలేదు ఎదిగినవాడు కలిసి రాలేదు నాన్న జబ్బుమనిషి — పిన్ని అశక్తురాలు —

వీళ్ళందరూ తనమీద ఆధారపడ్డవాళ్ళు!

అందరినీ వదిలి, కట్నాలూ — కానుకలూ దోచుకుని, వాళ్ళని బికారులుగా చేసి, తను రాణీ వాసం వెళ్ళిపోయి, అక్కడినుంచి వీళ్ళకోసం మొసలి కన్నీళ్ళు కారుస్తూ కూర్చోలేదు

వివాహం మనిషి జీవితానికి అవసరమయిందే కావచ్చు కానీ తన జీవితానికి వివాహం కన్న అవసర మైన బాధ్యతలు యింకా వున్నాయి! వాటన్నిటి తర్వాతే పెళ్ళి విషయం!"

గట్టిగా తన నిర్ణయాన్ని పునః పటిష్ఠం చేసుకుంది, మనసులోనే

[ఇంకా వుంది]

ఆ అయోమయపు అంధకారాన్ని దూరం చేస్తూ, దివ్వెను వెలిగించింది రోజా శమంత!

సాధారణంగా ప్రేమ గుడ్డిదంటారు స్త్రీల ప్రేమ మరీ గుడ్డిదని తన నిశ్చితాభిప్రాయం! తను ప్రేమించినవాడు గనక, పెళ్ళాడతానని ముందుకు వస్తే, అతడిలో ఎన్ని వ్యసనాలూ, సంకుచితత్వమూ, [illegible], క్రూరమైన [illegible] వున్నా అన్నిటినీ క్షమించి [illegible] యిముడ్చుకోగలంత సహనశక్తి (?), ప్రేమమయి యీ దేశపు స్త్రీ!

మగవాడు పెళ్ళి విషయం వచ్చేసరికి, అంత వరకూ ఆరాధిస్తున్న స్త్రీలోగూడా అంతకు ముందు చూడని లోసుగు ఎన్నిటినో వెదక ప్రయత్నిస్తాడు

అదే పెళ్ళి విషయం వచ్చేసరికి, అంతవరకూ [illegible] మనసుపడినవాడైతే, అంతకుముందు అతడిలో [illegible] - కూడా భవిష్యత్తులో [illegible], [illegible] అంగీకరిస్తుంది!

[illegible] ఒకపాటికి [illegible], [illegible] వాళ్ళని శాసించే [illegible], [illegible], [illegible] వాస్త వాలుగా గుర్తించి, [illegible] ప్రవర్తించగల మనో ధైర్యమున్నవాళ్ళే [illegible] వ్యక్తులు!

[illegible] - యీ [illegible] కి శమంత సరి [illegible]?

తను చిన్నాటి నుంచీ ప్రేమించి, తనను చిన్నాటి నుంచి యిష్టపడుతున్నాడని తెలిసీ, [illegible] వివాహ విషయం వచ్చేసరికి, —

[illegible] లేక [illegible] ఏమీ లేదు!

[illegible] హెల్త్, మంచి ఉద్యోగంతో

చూస్తాడు. అందుకే బిందె చంకన యిరికించుకుని వేగంగా వెళ్ళబోయింది.

''నీరదా!'' గోపీ కేకతో నీరద అడుగు కదపలేకపోయింది.

''నీరదా! నిజంగా నీకు భూదేవికున్నంత ఓర్పు వుంది. మరికాసేపు వుంటే యెక్కడ బైటపడిపోతానో అని వెళ్ళటానికే లేచావు. అవునా? పోనీలే ఆ సంగతి వదిలెయ్యి. నేనెందుకు రమ్మన్నానో అడిగావా ?''

''ఇప్పుడు అడగనా గోపీ!'' శాంతంగా అడిగింది నీరద.

''బాగుంది. నేను అడగమంటే అడుగుతావా? కనీసం వూహించగలవా, ఎందుకు రమ్మన్నానో ?''

''మన యిరువురిమధ్య చిన్నతనంనుంచీ అరమరికలు లేకుండా వున్నాము కాబట్టి నా పెళ్లి అయేలోపల చూద్దామని పిలచివుంటావు. నా పెళ్లి గురించి విశేషాలు తెలుసుకుందామని అనుకొనుంటావు.''

''కాదు ... యీ పెళ్లి నీవు చేసుకోవద్దని గట్టిగా చెప్పాలని పిలిచాను.''

''ఇందుకా గోపీ, నీవు పిలిచింది...''

నీరద అడిగిన ప్రశ్న తుఫాను రాబోయేముందు ప్రశాంతత సూచన అనిపించింది గోపీకి. ''ఈ విషయం చెప్పటానికే పిలిచాను.'' తెల్లబోతూ ఓ అడుగు ముందుకు వేశాడు.

వెలవెలబోతున్న సంధ్యాకాంతిలో పాలిపోయినట్లున్న (తెలతెలబోతున్న) గోపీ ముఖంవైపు చురుకుగా చూచింది నీరద.

''గోపీ! తాంబూలాలు పుచ్చుకున్న పెళ్లి పీటలమీద ఆగిపోయిన పెళ్లితో సమానం ఆడదానికి. కన్య తలితండ్రుల చాటున భార్య భర్త చాటున వుండాలి. అదే ఆడదానికి సుఖం, మరో విధంగా రక్షణకూడా ... మన పురాణాలు, మన సమాజం అన్నీ ఇదేమాట వుశ్చరించాయి. పోనీ ... నీవన్నట్లు నాకీ పెళ్లి వద్దు అంటాను. అప్పుడు నేను సుఖపడతానా? నేనున్నానంటూ చేదోడు ఎవరైనా నిలుస్తారా? ఆడదానికో అర్హత, వ్యక్తిత్వం కూడానా? ప్రతిక్షణం చస్తూ రోజులు గడపటమే ముక్తి మోక్షం. ఇది ఆడదాని దౌర్భాగ్యం కాదు సమాజం ఇచ్చిన కానుక. అంతే గోపీ అంతే.''

ఊపిరి పీల్చుకోటానికా అన్నట్లు ఒక్కసారి ఆగి తిరిగి అంది.

''గోపీ! వంశానికి మచ్చలేని పని, నాకు చెడు పేరు రాని పని యేదయినా వుంటే చెప్పు గోపీ! అప్పుడు నీమాట వింటాను. ఇలాంటి సలహామటుకు ఎప్పుడు ఎవరికి యివ్వకు.''

గోపీ అమాయకత్వానికి జాలిపడుతూ శాంతంగా అంది.

గోపీ ఏదో చెప్పటానికి నోరు తెరిచాడు. నీరద యీలోపలే అడ్డుతగిలింది.

''గోపీ! వయసులో నాకంటే పెద్ద అయినా, నీ మనసు పసితనం పోకడలు పోతున్నది. పూర్ణ వ్యక్తిత్వం పుణికిపుచ్చుకున్నవాడు నీ సలహా యేదయినా సంతోషంతో స్వీకరిస్తాను. వస్తా గోపీ యిప్పటికే చాలా పొద్దుపోయింది.''

# విముక్తి

(19 వ పేజీ తరువాయి)

మారు మాట్లాడటానికి ఆస్కారం ఇవ్వకుండా నీరద వెళ్లిపోయింది.

''నీరదా! నీ మనసో అగాధం. ఒడ్డున నుంచోని అగాధం లోతు తెలుసుకోబోవటం ఎంత హాస్యాస్పదం? నేను ఆ పనే చేశాను. (నేను అదే చేశాను).''

నీరదపోయినదిక్కేచూస్తూ అనుకున్నాడుగోపీ.

* * *

దొడ్లో అరుగుమీద కూర్చుని నీరద జాజిపూలు మాల కడుతున్నది.

నీరద దగ్గర కూర్చున్న విమల ఒక్కోపూవు అందిస్తున్నది.

ఏమాట అయినా చటుక్కున ముఖాన అనగల విమల యేదో విషయం అక్కను అడగటానికి తటపటాయిస్తున్నది. అక్క ముఖం పరీక్షగా చూస్తూ ఆలోచిస్తున్నది.

అక్క మనసులో ఏముందో ఆ దేముడికికూడా తెలియదేమో? పైకి అంత నిర్మలంగా వుండటం నాబోటిదానికి అసాధ్యం. ఏదయినా జరగరానిది జరిగితే ఆ విషయం గురించి మనసులో అయినా... తర్జనభర్జన, ఆవేదన ... తీవ్ర ఆలోచన కలుగుతాయే, అక్కకు అదేమీ లేనట్లు వుంది. నిజంగా లేదా? నేను వూహించింది పొరపాటా?

విమల పూలు అందించకపోవటంతో నీరద తలయెత్తి చూచింది.

పళ్లెంలో పూలు కెలుకుతూ కళ్లార్పకుండా తననే చూస్తున్న చెల్లెలిని చూచి ''నా ముఖాన కోతులేమైనా ఆడుతున్నాయా, విమలా?'' నవ్వుతూ అంది.

అక్క ఇంత నిండుగా ఎలా నవ్వగలుగుతున్నది? ఆ మాటే అడిగింది. ''అక్కా! ఎలా నవ్వగలుగుతున్నావు?''

''అదేం ప్రశ్నే విమలా?''

విమల దానికి జవాబు చెప్పలేదు. ''నే నొకటి అడుగుతాను నిజం చెబుతావా అక్కా?'' అంది పూలు అందిస్తూ.

''ఊ!''

''మొన్న సాయంత్రం రంగనాయకుని గుడిలో గోపీ నెందుకు కలుసుకున్నావు?''

నిశ్చలంగా ఉన్న నీటిలో బెడ్డ వేస్తే ఒక్కసారి నీరు చెదిరి మళ్ళీ మామూలు అయినట్లు లిప్తపాటు నీరద కలవరపడి అంతలోనే సర్దుకుంది.

''నీకేనా యీ సంగతి మనింట్లో అందరికీ తెలిసిందా?'' విమల కళ్ళలోకి గుచ్చిచూస్తూ అడిగింది నీరద.

''ఎవరికి తెలిసినా ఎంత రభస అవుతుందో తెలుసుకదా, నా ఒక్కదానికే తెలుసు.''

''యీ సంగతి నీ మనసులోనే వుంచుకోవాల్సింది.'' నీరద స్వరం బొంగురుగా వచ్చింది.

''నే నెవరితో చెప్తాను? నిన్నే అడిగాను. ఎందుకు కలుసుకున్నావు అక్కా?''

నీరద చెప్పటమా, మానటమా, అన్నట్లు ఆలోచనలో పడిపోయింది.

విమల అక్కను చేతితో కుదుపుతూ. ''చెప్పక్కా?'' అంది.

నీరద విమలవైపు ఓసారి చూచి ''చెప్పదగ్గ విషయం ఏమీలేదు'' అంది. పొడిపొడిగా

విమల వూరుకోలేదు ''పోనీ చెప్పదగని విషయం వుందా?'' అన్నది

''విమలా?''

''ఎందుకక్కా అరుస్తావు యిక్కడే వున్నాగా?''

విమలా అని పెద్దగా అరచినందుకు నీరద సిగ్గుపడింది. తదేకంగా మాలపై దృష్టి నిలిపి మాల కడుతూ వుండిపోయింది.

పది నిమిషాలు మౌనంగా గడిచిపొయ్యాయి

''అక్కా! యీ పెళ్లి నాకు యిష్టం లేదని చెప్పరాదుటే.'' విమల పూలు అందిస్తూ అంది

''నువ్వు అదేమాట అంటున్నావా విమలా!'' చేతిలోంచి జారిపడిన మాలను తిరిగి చేతిలోకి తీసుకుంటూ నీరద అంది.

''అంటే ... యిదేమాట నీతో ఇంకొకరు అన్నారన్నమాట...?'' విమల ప్రతి మాట నొక్కి పలుకుతూ అంది.

నీరద మునిపంటితో (పెదవి) కొరుకుతూ వుండిపోయింది.

విమల తనముందు వున్న పూల పళ్లాన్ని పక్కకునెట్టి నీరద దగ్గరగా జరిగి బుజంమీద చెయ్యి వేసింది. ''అక్కా! నువ్వు తిట్టినా కొట్టినా భరిస్తాను. నువ్వా ముసలాడిని చేసుకోటం భరించలేను.'' బాధగా అంది. అంతలోనే ఆవేశంగా ... ''అక్కా! యింత అన్యాయం నాకే జరిగితే ఏం చేస్తానో తెలుసా? వీళ్లందరి రోగం కుదిరేటట్లు కులము గోత్రము లేనివాడితో లేచిపోతాను.''

నీరద చటుక్కున విమల నోరు చేతితో మూసేసింది. ''విమలా! యేమిటా అర్థంలేని వాగుడు. నలుగురూ వింటే ఏమనుకుంటారు? వళ్లు దగ్గిరుంచుకుని మాట్లాడు'' అంది.

'అక్కా! నువ్వుత్త పిచ్చిదానివి అందుకే ఆ భగవంతుడుకూడా నీకు జరిగే అన్యాయానికి కళ్ళప్పగించి వూరుకున్నాడు అసలు నలుగురు అంటే ఎవరు? మనబోటివాళ్ళ నలుగురు అదే సంఘం అంతేనా? పెళ్ళి చేసుకోటం నలుగురి కోసం కాదు మనకోసం, మన సౌఖ్యంకోసం ఈ నలుగురికోసం ముసలాడినయినా కుష్ఠురోగి నయినా పెళ్ళాడటానికి ఆమోదించటం తనకి తాను వంచించుకోవటమే పోనీ, ఒక్కమాటకు జవాబు చెప్పు! మనస్ఫూర్తిగా యీ పెళ్ళికి ఒప్పుకున్నావా?''

నీరద మాట్లాడలేదు ఎక్కుపడ్డ దారాన్ని జాగ్రత్తగా తియ్యటంలో పడింది

నీరద జవాబు చెబుతుందని కాసేపు చూచింది విమల

'దారం తెగకుండా ముడి విప్పటానికి ఎంత శ్రద్ధ చూపిస్తున్నావో, ఎవరి భవిష్యత్తు వారు అంత శ్రద్ధగా తీర్చిదిద్దుకోవాలికదా అక్కా!''

నీరద మాట్లాడలేదు

మాట్లాడుతుందని కాసేపు చూచింది, విమల

తిరిగి విమలే మాట్లాడక తప్పలేదు

''అక్కా! నాన్నగారిని పెళ్ళాడి పిన్ని యెంత సుఖపడుతుందని నీ అభిప్రాయం'' అంది

యీసారి కూడ నీరద పెదవి విప్పలేదు

విమల హేళనంగా నవ్వింది 'నువ్వు మాట్లాడవు అక్కా! నాకు తెలుసు యీ సంగతి బాగా తెలుసు అందుకే ఎంతో ఆలోచించి మరీ చెబుతున్నానక్కా! పెద్దల మాట వినటమే బుద్ధిమంతుల లక్షణం అనుకుని అన్నింటికీ తల వూపకూడదు చిన్నవాళ్ళను తీర్చిదిద్దవలసిన పెద్దలు తప్పు పనులు చేస్తుంటే అది తెలిసీ చిన్నవాళ్ళు వూరుకోకూడదు బుద్ధి చెప్పాలి గుణపాఠం నేర్పాలి'' అంది

''బాగుంది'', నీరద తిరిగి పూలు కడుతూ ఏ భావం వ్యక్తం చేయకుండా అన్నది

'నీ కసలేం తెలియదు అక్కా! అందుకే యింత పెద్ద విషయాన్ని అతి తేలికగా తీసుకుంటున్నావు నాన్నగారిని పెళ్ళాడి పిన్ని సుఖపడుతుందనుకుంటున్నావా? ఉహూ, సుఖపడటంలేదు లోలోపల కుమిలిపోతున్నది''

విమల మాటలకు నీరద అడ్డుతగులుతూ అంది ''తెలిసీ తెలియకుండా మాట్లాడకు విమలా?''

''అక్కా! నీకున్నంత శాంతం లేకపోయినా తొందరపాటు లేదు నాకు తెలిసే మాట్లాడుతున్నాను ఎన్నిసార్లో పిన్ని ఒంటరిగా కుళ్ళి కుళ్ళి ఏడ్వటం చూచాను ఎవరూ తన ఏడుపు చూడకుండా జాగ్రత్త పడేది అంతే నాన్నగారు పిలిస్తే వెంటనే వెళ్ళేది కాని ఆ సమయంలో పిన్ని ముఖంలో భావాలు చదివావా? యీ ప్రపంచంలో వున్న వేదన కసి, అసహ్యము, అసహాయత, అన్నీ పిన్ని ముఖంమీదనే చోటు చేసుకోటం చూశాను ఆడదానికి కావలసింది ఐశ్వర్యము అంతస్తులు కాదు అనుకూలమైన దాంపత్యము''

నీరద ఆశ్చర్యపోతూ ''యిన్ని విషయాలు ఎలా తెలుసే విమలా? యింత చిన్నదానివి?'' అంది

''విషయం అవగాహన కావటానికి వయస్సే రావాలా? వయసు ప్రధానం కాదు అవగాహన శక్తి వుంటే చాలు కొన్ని విషయాలు కొందరికి చెప్పకుండానే తెలుస్తాయి కొందరు పెద్దలకు తెలియనివి పిన్నలే తెలుసుకుంటున్నారంటే? నువ్వే ఆలోచించు అక్కా!''

''నువ్వు చెప్పింది పిన్ని విషయంలో నిజమేనా విమలా?'' మాట మార్చేస్తూ అంది నీరద

''నిజం కాదని ఎలా అనుకుంటున్నావు? మనింటికి తరుచు వచ్చే పేరిశాస్త్రిగారు, రామచంద్రయ్యగారు, శంకరరావుగారు, ఉదాహరణ వాళ్ళనే తీసుకో వాళ్ళను చూడంగానే నాన్నగారు గుర్తుకు వస్తారు ఆ వయసు వాళ్ళను చూస్తే పెద్దలు గుర్తుకు రాక పిన్నలు గుర్తుకు వస్తారా? 'బాబయ్యగారూ!'' అని పిలవబుద్ధి వేస్తుంది అదే మురళి, రఘునాధం మాష్టారు, చంద్రం, ఉమామహేశ్వరంని చూస్తే చెడు ఊహలు కాకపోయినా స్నేహభావము, సిగ్గు లాంటి అనుభూతులు కలుగుతాయి పిన్నికి పూర్తి స్వాతంత్రం వుంటే కోరి నాన్నగారిని పెళ్ళాడేదా? ఇప్పుడు నీ సంగతే చూద్దాము నీ ఇష్టంవచ్చినవాడిని చెప్పు వివాహం చేస్తానని నాన్నగారు మాటమాత్రం అంటే నీ అంతట నీవు ఈ ముసలాడిని పెళ్ళాడటానికి

ఒప్పుకోనేదానివా ? చెప్పు అక్కా చెప్పు ?'' విమల ఆవేశంగా అంది.

విమలకి పెంకితనము మొండితనము తప్ప యేమీ తెలియదు. ఉత్త పసిపిల్ల అనుకుంటున్న నీరద, యిప్పుడు విమల మాటలు మానసికంగా ఎంత పెరిగిందో గ్రహించిన నీరద ఆశ్చర్యంగా కళ్ళు పెద్దవిచేసి చెల్లెలివంక చూస్తూ వుండి పోయింది.

''ఇందులో అంత ఆశ్చర్యంపొందే సంగతి ఏముంది అక్కా ? తండ్రి వయసువాడు నీ బుజం మీద చెయ్యివేసి మాట్లాడితే వంటిమీద గొంగళి పురుగు పాకినట్లు వుంటుందికాని మరో భావం కలుగుతుందా ? కావాలంటే పిన్నిని ప్రతి నిమిషం కనిపెట్టిచూడు...ఎంత సుఖపడు...''

''విమలా ?''

చాలాసేపటి నుంచి గుమ్మం అవతలగా నుంచుని వీళ్ల సంభాషణ వింటున్న అవధాని, నాలుగు ఇళ్లకు వినపడేటట్లు కేకవేశాడు.

అవధానికి అంత దూరాన నుంచున్న శారద గిరున తిరిగి లోపలికి పోయింది.

విమల నిర్లక్ష్యంగా నుంచుంది. నీరద ఒణికి పోతూ విమలకు అడ్డంగా నుంచుంది, జరిగే పరిణామం వూహిస్తూ.

అవధాని ఒక్క అంగలో లోపలికి వచ్చి ... (గడపదాటి వచ్చేశాడు) ... అడ్డువచ్చిన నీరదను పక్కకునెట్టి విమల బుగ్గలపై టపటప కొట్టాడు.

''ఏమే ! ఆడముండవు, పరాయి యింటికి వెళ్లవలసినదానివి నీలో యిన్ని వ్యూహాలు దాగివున్నా యన్నమాట...? అభం శుభం ఎరగనిదానికి నూరి పోస్తున్నావా ? ఇంకా పసితనం చేష్టలని ఎవరింటి కెళ్లినా చూచీ చూడనట్లు వూరుకున్నాను. ఇంత తెగించినదానివని తెలిస్తే, ముందు నీ పెళ్లే చేసే వాడిని. నన్ను చేసుకుని మీ పిన్ని కష్టపడు తున్నదా ? చెప్పవే చెప్పు ?''

విమల మాట్లాడలేదు. కళ్ళు మూసుకుని దెబ్బలు భరిస్తున్నది. తండ్రికి రెండుసార్లు అడ్డం పోయిన నీరదకు కూడా రెండు దెబ్బలు పడ్డాయి

''నాన్నగారూ ! మీకెంత మొండితనము, అహంకారము, ఉన్నాయో నాకూ అంత పట్టుదల, కోపము వున్నాయి. అక్క సుఖపడటానికి యింత కన్నా పెద్ద దండనే భరించగలను కాని.. మీకన్నా వయసులో పెద్ద అయిన ఆయనకు అక్కనిచ్చి పెళ్లి చేస్తే అది ఎలా తప్పించాలో నాకు బాగా తెలుసు నాన్నగారూ బాగా తెలుసు.'' విమల స్థిరంగా నిలబడి ధైర్యంగా చెప్పింది.

''బాగా తెలుసూ ? బాగా ? ఏం చేస్తావేం ?'' అవధాని కూతురు రెక్క గట్టిగా పుచ్చుకుని అంత కన్నా గట్టిగా అడిగాడు.

''అక్క సుఖం కోసం చిన్న త్యాగం చేస్తాను. నన్ను చూచి యీ ఊళ్ళోవాళ్ళు... ఎవరూ... ఎప్పుడు... గుండెలమీద కుంపటిలా కూతురు ఎదిగి వున్నా ముసలాడికి యివ్వకుండా వుంటారు కోరి ఎవతీ ముసలాడిని చేసుకోదు. అధవా చేసుకున్నా ఏవో భయంకర పరిస్థితులవల్లే అనుకోవాలి. సాలె గూడు లాంటి దానిలో ఒకసారి చిక్కినట్టే ఆడపిల్ల దారీ తెన్నూ కానరాక బందీ అవుతుంది.

అక్క పెళ్లి ఎలా తప్పిస్తానని కదా నాన్న గారూ, మీకు కావలసింది ? అదేమంత పెద్ద కష్టం కాదు. అక్క పెళ్లికి గంట ముందే నా శవం గుండాలమ్మ చెరువులో తేలితే చాలు.''

అవధాని చేతిలో ఉన్న తన చేతిని గుంజుకొని విసురుగా వెళ్ళిపోయింది విమల.

అవధాని తేరుకోటానికి చాలాసేపు పట్టింది.

* * *

మధ్యాన్నం ఒంటిగంట అయింది.

అవధాని భోజనం కాంగానే నడవాలో ఉయ్యాల బల్లమీద కూర్చుని తమలపాకులు నమలటం అలవాటు.

శారద ఆకులకు సున్నం రాసి యిస్తుంటే అందుకుంటూ (పర పర) నములుతూ ఆలోచిస్తు న్నాడు.

అవధాని భార్య వైపు చూసి... ''నీరదను పిలు'' అన్నాడు. శారద అలాగే అన్నట్లు తల వూపి వెళ్ళబోతుంటే... ''యిదో మాట... అమ్మడు భోంచేస్తుంటే ఆగి పిలుచుకురా!'' అంటూ ఉయ్యాలబల్ల కడ్డంగా వారగిలపడ్డాడు.

శారద నీరదను వెంటపెట్టుకొచ్చేటప్పటికి చిన్న కునుకుకూడా తీశాడు.

వంటింట్లో పనేం లేనందున విసినకర్ర చేత బుచ్చుకుని వీళ్ళ వెనుకనే వచ్చింది సుబ్బమ్మ.

అడుగుల సవ్వడి వింటూనే లేచి కూర్చున్నాడు అవధాని. ఆవులిస్తూ నోటిదగ్గర చేత్తో చిటికలు వేస్తూ ''హూ, ఆ...'' అంటూ నీరదవైపు చూచాడు.

ఏ ఉపోద్ఘాతము లేకుండానే. . ''అమ్మడూ ! పై శుక్రవారం పెళ్లికి ముహూర్తం పెట్టించాను'' అన్నాడు.

నిమిత్తమాత్రురాలిలా తల వంచుకు నుంచుండి పోయింది నీరద.

శారద ఓరకంటితో నీరదను చూచి తల తిప్పుకుంది గోడమీద పటంవైపు.

కూతురు ఏదయినా చెబుతుందేమో అని అవధాని నీరదవైపు చూస్తున్నాడు.

వీపుమీద చెంగు తొలిగించి విసినకర్రతో పర పర వీపు గోక్కుంటూ... ''దానితో చెప్పేదేముం దిరా అవధానీ ?'' అంది సుబ్బమ్మ.

శారద కలగజేసుకుంది... ''అదేమిటి పెళ్లయేది నీరదకు. చెప్పకపోతే ఎలా తెలుస్తుంది ? చెప్ప నీయండి'' అంది.

అవధాని భార్యవైపు తృప్తిగా చూశాడు.

''అమ్మడూ ! రాఘవయ్యతో నీ పెళ్లి కావటం ఖాయం. పిచ్చి పిచ్చి ఆలోచనలు మటుకు చేయకు. విమలను బుచ్చి కక్కాయితో విశాఖపట్నం ఎందుకు పంపించానో తెలుసా? అదక్కడే వుంటే మంచిదని... అసాధ్యపు పిల్ల వివాహం చెడగొట్టినా కొట్టకలదు. రాఘవయ్యతో నీ వివాహం తలపెట్టనని అను కొనే ధైర్యంగా ఊరు వెళ్ళింది. అది మళ్ళీ వచ్చే టప్పటికి... నీ మెడలో ఆ మూడు ముళ్ళూ పడి పోతేకాని నా కాలూ చెయ్యి ఆడదు.''

మధ్యలో సుబ్బమ్మ కలగజేసుకుంటూ ... ''అయినా చిన్నపిల్ల. దాని మాటలకు భయపడే దేమిటిరా ?'' అంది.

''అమ్మమ్మ ... అలా అనకు. అది పిల్లా ? పిడుగుకాని. చిన్నప్పటినుంచీ చూస్తున్నాను. దానిది ఎంత మొండితనమో నాకు తెలియదూ ? అన్నంత పనీ అక్షరాలా చేసి చూపిస్తుంది. అక్క మెడలో పసుపుతాడు చూచిందంటే ఇహ నోరు మూసు కుంటుంది.'' అన్నాడు.

సుబ్బమ్మ కొంగు పరచుకుని చారగిలపడింది, విసనకర్రకు పని కల్పిస్తూ...

''ఈ కాలం మరీ విడ్డూరాలు. వెధవ (అగాయిత్యాలు), ఎదిరింపులు ఎక్కువయాయి. నాకూ ఆయనకు పలభై ఏళ్ళు తేడా ? ఆయు ర్దాయం తీరి ఆయన దోవ ఆయన చూచుకున్నారు ఉన్నన్నాళ్లూ మాకేమయింది?'' అంది ఆవులిస్తూ.

''దీనికీ నాకూ కాస్త తేడా లేదూ ? మాకు మటుకు ఏమయింది ?'' భార్యవైపు చూచి అవధాని అన్నాడు.

నీరద తల పైకి ఎత్తలేదు. అలాగేనుంచుంది.

''చూడు అమ్మడూ ! నేను చెప్పేది జాగ్ర త్తగా విని అనగాహనచేసుకో. మందలించి చెప్ప టానికి పసిపిల్లవుకావు. విమల ఇంకా ఏం చెప్పిందో యేమిటో అన్నీ మరచిపో.

ఆనాడు నాదగ్గర చాలా డబ్బు వుంది. ఎదురు కట్నం యిచ్చి మీ పిన్నిని తీసుకురాగలిగాను. పంటమీద నష్టంరావటం, కోర్టులో కేసు నెగ్గక పోవడంతో సంసారం జరపటానికి తాకట్టు పొలం విడిపించటానికి రాఘవయ్య దగ్గర పదివేలదాకా తీసుకురాక తప్పలేదు. అతగాడేం పరాయివాడు గాదు. స్వయాన మీ పిన్ని అన్నగారు.

ఇలాటి పరిస్థితులలో కట్నం యిచ్చి నీ పెళ్లి చేయటం సాధ్యం అయే పనికాదు. నీకా ఇరవై ఏళ్లు దాటాయి. కట్నం లేకుండా పెళ్లాడేవాడు మరో పదేళ్లకు కూడా దొరకడు. రాఘవయ్య అంతటి వాడు. ఇచ్చిన డబ్బు వదులుకొని కోరి నిన్ను పెళ్లాడుతానని కబురంపాడంటే అది నీ అదృష్టం చిన్నపిల్లలు వున్నా చూడటానికి పనివాళ్ళు వుంటారు. పేరుకి తల్లివి అంతే.

మీ అమ్మ, నాకోసం సంసారంకోసం ఉత్తమ ఇల్లాలుగా నడచి పదిమందిచేత శభాష్ అనిపించు కుంది. నీవూ మీ అమ్మ మార్గాన నడచి నలుగురి చేత మెప్పుపొందాలనే నా తాపత్రయం. రేపు ఏం జరిగినా ఫలానావారి అమ్మాయి అంటారు. అందుకే యింతగా చెప్పటం

విమలలాంటిదాని అయోమయం వాగుడు విని యే అఘాయిత్యమో తలపెట్టావనుకో, లోకులు.. ఆ తల్లి కడుపున పుట్టవలసింది కాదు అని స్వర్గస్తు రాలయిన మీ అమ్మనుకూడా కలిపి అంటారు.'' అంటూ భార్యవైపుకు చూచాడు నే చెప్పింది సమంజసంగా వుందికదా అన్నట్లు.

అంతవరకు భర్తనే చూస్తున్న శారద ఉలిక్కి పడి తిరిగి సర్దుకుంది. ''మీరు చెప్పింది బాగుంది. మా పెద్ద అన్నయ్య గుణం మొదటినుంచీ నాకన్నా మీకు తెలుసా ? మా వదినను పువ్వుల్లో పెట్టి పూజించేవాడు. నీరద అదృష్టం. వయసు ప్రధానంటండీ ! అయినా మగాడికి వయసుతో పని ఏమిటి ?'' గబగబ అంది.

"అమ్మడూ! ఇహ వెళ్ళు ఇది చెప్పటానికే పిలిచాను"

అవధాని అనంగానే ఎవరో తరుముతున్నట్లు అక్కడనుంచి వెళ్ళింది నీరద సరాసరి తన గదిలోకి వెళ్లి తలుపులు లోపల బిగించుకుంది అంతవరకూ బలవంతాన ఆపుకున్న కన్నీళ్లు బుగ్గలమీద నుంచి ఏకధారగా కారుతుంటే మంచంమీద పడి దిండులో ముఖం దాచుకుంది

నీరద మదిలో యేముందో, అంతరంగంలో ఎన్ని అల్లకల్లోలం జరుగుతుందో భగవంతుడికే తెలియాలి

"విమలా! విమలా!" కన్నీళ్ళతో దిండు తడి చేస్తూ పదే పదే అనుకుంది నీరద అసహాయురాలిలా

* * *

పెండ్లికొడుకు రాఘవయ్య అభ్యంతరం చెప్పటంవల్ల అవధాని కూతురు పెళ్ళికి పెద్దగా ఎవరినీ పిలవలేదు అయినా ? పెళ్లి పెళ్లే, పిలిచినంతవరకూ వచ్చినవాళ్ళతో పెండ్లిపందిరి నిండి పోయింది

పెండ్లిపీటలపై కూర్చున్న రాఘవయ్య భారీ మనిషి తగిన లావుతో వుండటంవల్ల వృధాప్యం చాయలు తక్కువతో పోతపోసిన ఉత్సవ విగ్రహంలాగా కొట్టొచ్చినట్లు కనిపిస్తున్నాడు

అవధాని పెళ్లిపందిట్లో కాలుగాలిన పిల్లిలా తిరుగుతున్నాడు కూతురి మెడలో మూడు ముళ్ళు పడితేకాని ఆ కంగారు తగ్గేటట్లు లేదు

పెళ్లికి వచ్చిన పెద్దలెవరూ పెళ్లికొడుకు రాఘవయ్య గురించి విడ్డూరంగా గుసగుసలు ఆడటం లేదు బూజుపట్టిన పాత సాంప్రదాయాలను శిరసా వహిస్తున్న పల్లెటూరు ప్రజ అక్కడివాళ్ళు యువ తరంవారు పెద్దలతో వచ్చినా పసితనం వదలని భావాలు గలవారేను విశాల హృదయాలు శరీరంకే గాని మనసుదాకా సోకనివారు

పెళ్లికి అడ్డుతగిలేవారు లేకపోవటంతో పెళ్లి తంతు సక్రమంగా మొదలయింది

శాస్త్రిగారు మంత్రాలు ఆపేసి ఆడంగులకేసి తిరిగి, "పెళ్లికూతురిని తీసుకురండ్రా!" అన్నాడు

పట్టుచీరలు రెపరెప లాడించుకుంటూ లోపలికి వెళ్ళిన ముత్తయిదువులు, ఘొల్లుమంటూ పందిట్లోకి వచ్చారు

"పెళ్లి యిష్టంలేక పెళ్లికూతురు ఏదో మింగిందిట ?" ఎవరో మరెవరితోనో అంటున్నారు

హడావిడిగా అటు వెళుతున్న ఒకాయన వీళ్ల మాటలు విని. "పెళ్లికూతురు కాదు పెళ్లి కూతురు సవతితల్లి మింగింది" అంటూ చెప్పి వెళ్లిపొయ్యాడు

మరో నిమిషంలో శారద గది దగ్గర గుమిగూడారు, రాఘవయ్యతో సహా

శారద నోట్లోంచి నురుగు వస్తూంది కళ్లు మూతలుపడి వున్నాయి పెదవులుమటుకు కదిలిస్తున్నది. రెండు పిడికిళ్లు మూసుకుని వున్నాయి. పక్కగా చితగకొట్టబడిన గన్నేరుపప్పు, గాజుగ్లాసు గుండ్రాయి వున్నాయి.

# వి ము క్తి

"నిన్నే పలవరిస్తున్నది." అని చెప్పటంతో నీరద పరుగున పిన్ని దగ్గరకు వచ్చింది "పిన్నీ! పిన్నీ!" అంది మొదటిసారిగా శారదను.

శారద పెదవులు కదులుతున్నాయికాని మాట పైకి రావటంలేదు బలవంతాన కళ్లుతెరిచి నీరదను చూచి వెంటనే కళ్లు మూసుకుంది

విఫల ప్రయత్నంమీద చేతులు కదిలించి నీరద వడిలో వేసింది తన చేతులు. మూసివున్న గుప్పెట లావుగా వుండటం చూచి "ఏమిటి పిన్నీ ?" అంది నీరద శారద చేతులు తన చేతిలోకి తీసుకొని

శారద గుప్పెట విడిపోయింది ఎడంచేతితో వున్న గన్నేరుకాయ కిందపడింది కుడిచేతిలో వున్న మడతలు పెట్టబడ్డ కాగితం నీరద చేతిలోకి జారింది వెంటనే శారద చేతులు అచేతనంగా వాలిపొయ్యాయి

"పిన్నీ!" అంటూ నీరద దోసిట్లో ముఖం దాచుకుంది

"అదేమిటో చదవండ్రా!" కాస్త గోల అణిగిం తరువాత ఎవరో అన్నారు మరెవరో ఆ కాగితం మడతలువిప్పి పెద్దగా చదవటం మొదలు పెట్టారు

**'నేరం' మీద దాడులు**

జపాన్‌లో అంతకంతకు పెరిగిపోతున్న నేరాలను అణిచివేయాలన్న సంకల్పంతో జపాన్ పోలీసులు కనీ వినీ ఎరుగనంత పెద్ద ఎత్తున దాడి ప్రారంభించారట ఈ దాడిలో 1700 మంది పోలీసులు పాల్గొన్నారు వీళ్ళు ఒకేసారి 245 ప్రదేశాల్లో దాడి జరిపారు 700 మిలియన్ ఎన్‌ల విలువగల మారక ద్రవ్యాలు, 83 ఆయుధాలు పట్టుబడ్డాయట 251 మందిని పోలీసులు అరెస్టు చేశారు

నీరదా!

నేను నీకు తల్లిని కాకపోయినా తల్లి స్థానంలో ఉన్నదాన్నేనమ్మా! కాకపోతే యేడాది చిన్నదాన్ని అంతే నువ్వు నన్ను పిన్నీ అని పిలవటానికి ఎంత బాధపడేదానివో, తెలుసుకోలేనంత మంద మతిని కాదు సమాన వయస్కులు కావటమే కావచ్చు యిరువురిమధ్య అడ్డుగోడ పెద్దదే వుంది అందుకే మనము విప్పకోలేకపోయాము

వివాహం అనేది నూరేళ్ళ పంట ఊహా సౌధంలో రాకుమారుడు బంగారు కలలు ఫలించాలంటే పిన్నల మనసు పెద్దలయినా గ్రహించాలి లేక పిన్నలు పెద్దలను ఎదిరించాలి ఆ రెండూ నాలాగా నీకూ లేవు

నాకు తెగింపు లేకనే నీకు పిన్నిగా యీ ఇంట్లో అడుగు పెట్టాను అదీ ఒక అందుకు మేలే అయింది. యీ నా తెగింపే నీ భావి జీవితానికి మంచి మార్గం కావచ్చు

సిరిసంపదలే ఆడదాని అదృష్టం అని భావించే అన్నయ్య .నన్ను పెళ్లాడుతానని ముందుకు వచ్చిన అందము, ఆరోగ్యము అతి మంచితనము తప్ప .. పైసాలేని మామయ్యను మాయమాటలతో మిలటరీలోకి పంపి నన్నిక్కడికి పశువును తోలినట్లు తోలాడు.

ఈ కొద్దిరోజులలోనే నూరేళ్ల సంసార సౌఖ్యం, సంతృప్తి రుచి చూచాను. ఇలాంటి వివాహాల వల్ల లభ్యమయ్యే ఆనందం పొందివుండీ నిన్ను చూస్తూ చూస్తూ యీ సాగరంలోకి ఎలా పంపను చెప్పు ?

చచ్చేటప్పుడయినా నిజం చెప్పు అంటారు పెద్దలు నిజం బైటపెట్టవలసిన అవసరము వచ్చింది కాబట్టి చెబుతున్నాను.

అన్నయ్య మా వదినను భార్యగా సాటి మనిషిగా ఏ విధంగానూ చూడలేదు కూర్చుంటే తప్పు నుంచుంటే తప్పుగా చూశాడు అనుమానంతో అనుక్షణం నరకం చవిచూపించేవాడు, ఆడది కాబట్టే అన్నీ భరించిందేమో ?

వదినలో సహనం నశించేటప్పటికే పిల్లల తల్లి అయింది ఓరోజు మా పెరటి బావిలో శవం తేలింది కాలుజారి బావిలో పడింది నా భార్య అన్నాడు అన్నయ్య లోకం నమ్మినట్లే మెలిగింది కాని. పిల్లను యిచ్చి పెళ్లి చేయటానికి ముందుకు ఏ తండ్రీ అడుగు వేయలేదు

ఈ నిజం చెప్పి నీ పెళ్లి ఆపుచేద్దామనుకున్నాను. అన్నయ్యను చాటుగా బతిమిలాడాను వినకపోగా ఏమని బెదిరించాడో తెలుసా ? "నీ మామయ్యతో సంబంధం వుందని అవధానితో చెబుతాను నీ కాపురం ఏమవుతుందో ఆలోచించు నీరదను పెళ్లికి వప్పించు." అన్నాడు

లోకంలో యిలాటి అన్నగార్లూ వుంటారు నీరదా, ఈ నిజం అందరికి తెలియదు. అంతే

విమల నూరిపోసినా రెచ్చకొట్టినా నువ్వు మారలేదు విమల తెగింపుకన్నా నీ సహనం భయంకరమైనది. అది నిన్ను ఊబిలోకే లాగుతుంది. కాని సుఖశాంతులను యివ్వదు. నీ అంతరంగంలో నిరంతరం జరుగుతున్న ఘర్షణ నాకు తెలియంది కాదు. నీలాగా దైవాన్ని నమ్ముకుని మనోనిబ్బరం ప్రదర్శిస్తే నా గతే పడుతుంది అందుకు ఓ ఉపాయం ఆలోచించాను

ముందుగా . చిన్నపిల్ల అయినా విమలకు కృతజ్ఞత చెప్పకోవాలి అనుక్షణం చస్తూ బతికే కన్నా ముక్కు మూసుకుంటే రెండు క్షణాలు చాలు ఆ ధైర్యం లేకనే యిన్నాళ్ళూ బతికాను నిజం ఆలోచిస్తే చావటానికే ధైర్యం కావాలి నీ పెళ్లి ఆగిపోవాలంటే. . విమల చెప్పినట్లు పెళ్లికి రెండు నిమిషాల ముందు శవంగా మారితే చాలు, విమల నాకో దారి చూపించింది.

ఓ పక్క నిన్ను పెళ్లికి ఉసికొల్పుతూ మరో పక్క దైవాన్ని ప్రార్థించేదాన్ని ఆత్మహత్యకు తగిన మనోబలం కలగచెయ్యమని దైవం నా మొర ఆలకించాడు. నా యీ చిన్నపని నీ పెళ్లికి ఆటంకం కలిగిస్తేచాలు. ఏ లోకంలో వున్నా ఆనందిస్తాను

నీరదా! నీకేం కానుక లివ్వలేను. నీకు నచ్చిన వరుడితో వివాహం కావాలన్నదే నా ఆశ. అది యీ నా కథవల్ల అన్నా తీరాలి. లేకపోతే కానుకగా గన్నేరు కాయ యిస్తున్నాను అందుకుని... నే, వయనించిన మార్గాన్నే వచ్చేసేయి కాని... చూస్తూ... చూస్తూ... ఊబిలో కాలు పెట్టకు. అంతే చివరి సారిగా నే చెప్పేది.

భవాని ఆర్ట్ పిక్చర్స్ సమర్పించు

# సౌభాగ్యవతి

స్క్రీన్‌ప్లే - దర్శకత్వం
**పి. చంద్రశేఖరరెడ్డి బి.ఎ.**

నిర్మాత
**పి. నాగభూషణం యాదవ్**




నెగెటివ్ రైట్స్ కంట్రోల్డ్ బై: రఘురామా ఫిలిమ్స్ (విజయవాడ)

# విముక్తి

సీరదా! ఆలోచించు నా గురించి, కాదు నీ గురించి, నీ భవిష్యత్తు గురించి

(నీ పిన్ని) అభాగ్యురాలు,
శారద –

చదవటం ముగించేసరకూ ఎవరూ పెదవి కదపలేదు. అప్పుడే చైతన్యం వచ్చినట్లు తలో మాట విసరటం మొదలుపెట్టారు. అవధాని అయితే మరో పాతికేళ్ల వృద్ధాప్యం మీద పడ్డట్టు కుంగిపోయ్యాడు

తనకోసం చేసిన త్యాగం భరించలేనట్లు శారద గదంమీద పడి "పిన్నీ! పిన్నీ!" అంటూ ఆక్రోశిస్తున్నది సీరద.

"అంతా మోసం అవదానే ఏదో చేసి నా చెల్లెలిని చంపాడు. నే వూరుకోను" రాఘవయ్య పిచ్చిపట్టినట్లు అరుస్తున్నాడు. అంతటితో వూరుకోక అవధానిపై చెయ్యి చేసుకున్నాడు. నలుగురు అడ్డు రావటంతో...నా బొందిలో ప్రాణంవుండగా అది నా పెళ్లాం కావలసిందే పీటలమీద పెళ్లి ఆగితే ఎవడు చేసుకుంటాడో చూస్తాను. అవధాని పెళ్లాన్ని చంపాడని తెలిస్తే, దాన్ని ఎవరూ పెళ్లాడరు అవధానీ! ఇప్పుడే చెప్పు. నీకూతురు నాకే భాయుంకిడూ? లేకపోతే యీ ఇల్లు, నాకిస్తానన్న యీ పిల్లను లాక్కెళతాను ఎవరడ్డం వస్తారో చూస్తాను ఏ దేవుడు అడ్డుపడతాడో చూస్తాను.."

"దేముడి దాకా ఎందుకు పోతావు? నేనే అడ్డుపడుతున్నాను." అంగున ఎవరిదో కంఠస్వరం మోగింది.

"ఎవరు నువ్వు?" రాఘవయ్య కఠినంగా ప్రశ్నించాడు.

"చెప్పాలా? అయితే విను...అవసరం అయితే నీలాంటి పదిమందిని కొనగలవాడిని. నానాడు అంతరంగంలో సీరదను ప్రేమిస్తూ అదేమిటో తెలుసుకోలేని మూఢుడిని అయాను. కళ్ళుండి గుడ్డివాడిని, బలముండి పిరికివాడిని. నాలాంటి వాడు...ముందుకు ఎవరొచ్చినా శారదగారికి ఈ గతి పట్టేదికాదు. సీరద అంతరంగం అవగాహన అయి నా కళ్లు తెరిపిళ్లు పడేటప్పటికి కాలాతీతం అయిపోయింది. ఇప్పటికయినా మించిపోయింది ఏమీలేదు. సీరద నా భార్య...ఎవరడ్డు పడతారో చూస్తాను" అంటూ గోపీ ముందుకువచ్చాడు.

సీరద రయ్యిన లేచి గోపీ కాళ్లను పెనవేసింది నా చేతులు ఇక్కడనుంచి ఎవరూ కదిలించలేరు అన్నట్లు.

గోపీ సీరద బుజాలు పట్టుకు ప్రేమగా లేవనెత్తుతూ...శారదవైపు జాలిగా చూశాడు. అతన్ని అడ్డగించే సాహసం ఏ ఒక్కరూ చేయలేకపోయారు.





## ఎందుకు జాప్యం!?

ఎ. నటేశ్వర శర్మ.

ఓ మానవ మహాశయా!
కాస్త నేలుకోవయా!
సుప్రభాతం పాడడానికి
సూర్యుడే రావాలనకోకు.
సుధాగానం కాస్త
అమోఘితం కావాలనుకోకు.
ఈ ఉషస్సులోనే —
నీ తమస్సును పోగొట్టుకో.
ఈ ఉదయంలోనే —
నీ హృదయాన్ని చేపట్టుకో.
నీలో —
మహత్వముంది.
ఏగ్రాసవతా వుంది.
శక్తి ఉంది.
శార్దూల పరాక్రమమూ వుంది.
ధైర్యముంది.
ధార్మికత్వమూ వుంది.
బలముంది.
భాస్కర తేజమూ వుంది.
అయితే —
ఎందుకు నీకింత జాప్యం
అదే యింతవరకు నాకు
అర్థంకాని గోప్యం!

మీ ముఖము చూచి
మెచ్చుకొనేవారెందరో... మీ చర్మమునకు
చెరుపుచేసేవారూ ఉన్నారు
**పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్**
**సహాయమును పొందండి**

పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ మీ చర్మమును గాలి, దుమ్ము, వాతావరణములనుండి కాపాడుతుంది. దానిలోగల ఒక ప్రత్యేకపు హ్యూమెక్టంట్ చర్మమును తడి ఆరకుండా ఉంచుతుంది. దానివల్ల మీ ముఖము నున్నగా, జిడ్డులేకుండా ఉంటుంది. పౌడరు రాసుకొనేముందు దాన్నివాడితే దివ్యంగా ఉంటుంది. మీ మేకప్ తాజాగా, అందంగా గంటలతరబడి నిలుస్తుంది. లేదా, దాన్ని పూర్తి మేకప్‌గా వాడినా మంచిదే. జ్ఞాపకముంచుకోండి —మిమ్మల్ని మెచ్చుకొనే వారున్నట్లే, మీ చర్మమును మెచ్చుకొనేవారూ ఉండాలి.

# పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ — పౌడరు రాసుకొనేముందు వాడుటకు దివ్యమైనది




చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఏ.లో స్థాపితము)



# సరికొత్త ప్రేమకధ 'రాధ'

నేనొక చిన్న చిత్రగుప్తుడ్ని అంచేత నాకో చిన్న అలవాటుంది. రోజూ బుక్ సెంటర్‌కి వెళ్ళటం—కొత్తగా వచ్చిన పుస్తకాలు వాసన చూడటం—వాటితో కాలక్షేపం చెయ్యటం—అదీ ఈ మధ్యే—అంటే నేను నిరుద్యోగుల జాబితాలోకి ఎక్కినప్పటినుంచీ—అంటే ఓ మూడు నెలల్నుంచి అన్నమాట—కొత్తలో హాబీ అల్లా యిప్పుడొక డ్యూటీలా తయారయ్యింది. ఉదయం పదిగంటల కల్లా పుస్తకాల షాప్‌కి చేరుకోటం. జిలానీ మంచితనంతో షాప్‌లో ఓ మూల కుర్చీ వేసుకుని కూర్చోటం—ఆ పుస్తకాలూ, ఈ పుస్తకాలూ చూస్తూ ఓ రెండు గంటలు గడిపేయటం—పన్నెండు గంటలు కొట్టగానే యింటి ముఖం పట్టటం—యిదీ ఈ మధ్య నా దినచర్య. ఆ పుస్తకాలు చదివి నేర్చుకునే మాట దేముడెరుగును కాని—షాప్‌లో కూర్చున్నంత సేపూ చాలా మంది మనుషుల్ని చూడటం—కొందరితో పరిచయం ఏర్పడటం — కొన్నికొత్త సమస్యల్ని అవగాహన చేసుకోటం—యిదంతా కాస్త హుషారుగానే వుంది. అందుకే బుక్ సెంటర్‌కి వెళ్ళకుండా వుండలేక పోతున్నాను.

ఈ కధ కంతటికీ కారణం బుక్ షాప్ కాబట్టి దానిగురించి ఓ రెండు ముక్కలు చెప్పటం భావ్యంగా వుంటుంది—ఈ పుస్తకాల షాప్ ఒక చౌరాస్తాలో వుంది. దగ్గరే కలక్టర్స్ ఆఫీసూ, హాస్పిటలూ, కాలేజీలు, యూనివర్సిటీ అమ్మాయిలు కాపురం వుండే హాస్టళ్ళు—వుండటం వలన ప్రొద్దస్తమానూ బిజీగానే వుంటుంది ఆ సెంటర్. కాలేజీ కుర్రాళ్ళతో, అందమైన అమ్మాయిలతో, ఆఫీసులకీ, హాస్పిటల్‌కీ పోయే నవదంపతులతో చూడ ముచ్చటగా వుంటుంది అక్కడ. అందుకే ఆ షాప్‌లోంచి కదలబుద్ధి పుట్టేది కాదు. అందుకు జిలానీ కూడా అభ్యంతరం చెప్పేవాడు కాదు.

ఇలా వుండగా— ఏదో సాఫీగా సాగిపోతోంది అనుకున్న నా నిరుద్యోగపర్వంలో చిన్న పంచతంత్రం ప్రారంభమయ్యింది ఆ రోజునుంచే.

షాప్‌లో కూర్చుని ఎందుకైనా పనికొస్తుందని యియర్ బుక్ తీసి చదువుతున్నాను. ఇంతలో ఎవరో అమ్మాయి వచ్చిన అలికిడి అయ్యింది. తలెత్తి చూసి మళ్ళీ చదువులో నిమగ్నమయ్యాను. "రాధ గారి నవలలేమైనా వున్నాయా" అని అడిగింది ఆ అమ్మాయి.

పులిక్కిపడటం నా వంతయ్యింది. జిలానీ నా వైపే చూసి చిన్నగా నవ్వుతున్నాడు. నేను పట్టించుకోలేదు.

# మనస్సుకు నచ్చేటివి



MONSIEUR
టెరిన్—కాటన్ సూటింగ్

DAVARIN
టెరిన్—కాటన్ షర్టింగ్

ravikunj
వాష్-ఎన్-వేర్ పాప్లిన్స్

DAVANJOY
టెరిన్—కాటన్ షర్టింగ్

దావణగెరె
ఫ్యాషన్ ఫాబ్రిక్స్
ది దావణగెరె కాటన్ మిల్స్ లిమిటెడ్—
దావణగెరె. కర్నాటక.

టెరిన్— *కెమికల్స్ అండ్ ఫైబర్స్ ఆఫ్ ఇండియా వారి రిజిష్టర్డ్ ట్రేడ్ మార్క్.

Thomas/DCM 18

### ప్రతీక్ష

వానకోయిలు
పైకి చూస్తున్నాయి
వచ్చిన కాసిని
నీళ్ల బొట్టుల కోసం
గృధ్ర రాజములు
క్రిందికి చూస్తున్నాయి
చచ్చిన శవాల
మాంసపు గుట్టల కోసం

– జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి.

"వున్నాయండి" అంటూ పుస్తకాలు తీసుకు రావటానికి లోపలికి వెళ్ళాడు జిలానీ.

ఆ అమ్మాయిని పరీక్షగా చూశాను. వుంటాయి ఓ పదహారు పదిహేడు ఏళ్ళు–అంటే స్వీట్ సిక్స్టీన్ అనుకోవచ్చు. అందం గురించి అంత వుపోద్ఘాతం అనవసరం. టూకీగా చెప్పేస్తే–చాలా బాగుంటుంది కాని కళ్ళ గురించి కాస్త ప్రత్యేకంగా చెప్పాల్సి వుంది. ఎందుకంటే ఆ కళ్ళల్లో ఏదో తెలియని చాలా ఆకర్షణ వుంది. ఎదుటి మగాడు ఆరేళ్ళ వాడైనా అరవైయేళ్ళ వాడైనా (మధ్య వయసు వాళ్ళకి కాదా యిది వర్తిస్తుంది సుమా) యిట్టే మంత్రించే చూపులవి. ఆ విశాల నేత్రాలలో చక్కని మెరుపు వుంది. నిర్మలమైన చిరునవ్వుంది. చూపులు సూటిగా వున్నా అందులో ఓ రకమైన బెదురు వుంది. అందులో అందముంది. ఆమె అందగత్తె అవ్వటానికి ఆ కళ్ళే కారణం అనిపించింది నాకు. మేలిమి బంగారం రంగులో లేకపోయినా చూడముచ్చటగా వుంది. ఇక మిగతా వంపుసొంపుల విషయంలో ముంతాజ్ సుబ్బుల్నీ, మౌసమీ చటర్జీ పలువరసనీ, షర్మిలా టాగూర్ నవ్వినప్పుడు బుగ్గ మీదపడే సొట్టనీ, రేఖ పెదాల్నీ, చంద్రకళ హెయిర్ స్టయిల్నీ పోలి జయంతిలా బొద్దుగాముద్దుగా వుంది. వచ్చిన గౌడపల్లా రోజారమణిలా అటు బాల్యానికీ యిటు యవ్వనానికీ (అన్ని రకాల వేషాలకీ) పనికివచ్చే మధ్యరకం మనిషిలా ఎర్రని పట్టు లంగా మీద తెల్లని జాకెట్ వేసుకుంది. అంచేత వయసు మోస్తున్న పొంగులు వుండి వుండి వూపిరి తీస్తున్నప్పుడల్లా పుబికి వస్తున్నాయి. మొత్తం మీద ఆ జవ్వని పేరెంటో కాని కుర్రాళ్ళని వెర్రెక్కిస్తుందాలి అన్న నమ్మకం రూఢయింది ఆ రెండు నిముషాల్లోనే.

## సరికొత్త ప్రేమకథ

ఇంతలో ఆ అమ్మాయి 'రాధ వ్రాసిన' 'వింతమనుషులు'–'రాజీ' అన్న నవలలు తీసుకోటం. జిలానీ బిల్ రాసివ్వటం అంతా జరిగిపోయింది.

"ఆయన వ్రాసిన పుస్తకాలు యింకేమైనా వస్తున్నాయా" అని అడిగింది.

మిగతా పుస్తకాలు వెనక్కు తీసుకు వెళ్ళి షెల్ఫ్‌లో పేరుస్తున్న నెపంతో నా వైపు చూశాడు జిలానీ. నేను చిన్నగా నవ్వి వూరుకున్నాను.

"ఈ సారి అయన యిక్కడికి వచ్చినప్పుడు అడుగుతానులెండి" అన్నాడు జిలానీ.

"ఏమిటీ రాధగారు యిక్కడికి వస్తుంటారా" కళ్ళింతచేసి ఆశ్చర్యంగా అడిగింది.

"అప్పుడప్పుడూ వస్తుంటారు..." తేల్చేశాడు జిలానీ.

"ఈ సారి నేను యిక్కడికి వచ్చినప్పుడు ఎప్పుడైనా రాధగారు వస్తే నాకు పరిచయం చేస్తారా - ప్లీజ్" అంది ఆ మాటలంటుంటే ఆ అమ్మాయి గొంతుక ఎంతో తియ్యగా వినిపించింది.

"అలాగేనండి" అన్నాడు జిలానీ.

"థాంక్స్–వస్తానూ..." అంటూ వెళ్ళిపోయింది.

అప్పుడే వెళ్ళిపోవాలా యింకో పదినిముషాలుంటే ఏం పోయింది. అనిపించింది నాకు.

"ఎవరు జిలానీ...మీ రెగ్యులర్ కస్టమర్‌లా వుంది" వుండబట్టలేక అడిగేశాను.

"చాలా పుస్తకాలు కొంటుంటుందండీ" జిలానీ ఏ విషయాన్నైనా అలాగే ప్రారంభిస్తుంటాడు–"కాలేజీలో చదువుతోంది...బి.ఎస్‌సి. అనుకుంటాను" అన్నాడు.

"పేరు వగైరాలు ఏమన్నా తెలుసా నీకు"

"వీళ్ళంతా బాబీ అంటుంటారండి...మరి అసలు పేరేమిటో తెలీదు"

"బాబీయా.." కాస్త నిరుత్సాహపడ్డాను–"ఎవడికి పుట్టిందయ్యా ఆ పాడు బుద్ధి...అసలు బాబీకీ ఈ పిల్లకి ఏమన్నా పోలిక లున్నాయంటావా చెప్పు..." అన్నాను విసుక్కుంటూ.

"ఏమోనండిమరి... కాలేజీ కుర్రాళ్ళంతా అలాగే పిలుస్తుంటారు" మొహమాటపడిపోయాడు జిలానీ.

"నిజానికి ఏ సినిమా యాక్టరూ ఈ పిల్లని పోలదనుకో...ఈ అమ్మాయి ఒకెత్తూ సినిమాయాక్టర్లంతా ఒకెత్తూ...ఏమంటావ్ ఈ పిల్లే ఒక సినిమా యాక్టర్‌లా వుంచే మధ్యలో వాళ్ళ పేర్లు పెట్టి పిలవటం దేనికి చెప్పు...బుద్ధిలేక పోలేను..."

నా వువన్యాసానికి నవ్వుకున్నాడు జిలానీ.

"ఏ లక్ష్మీ అనో...వూర్వశి అనో పిలిస్తే బాగుంటుంది. ఏమంటావ్."

"నిజమేనండి..."

"అసలు ఆ అమ్మాయి పేరు ఏ హేమో... మాధవో అయ్యుంటుందని నా వూహ"

నా మాటలు పట్టించుకోకుండా–"అడుగో నండి. ఆపాడుగ్గా తెల్లగావున్నాడుచూడండి. ఆకుర్రాడ్నే చింటూ అని పిలుస్తుంటారు కుర్రాళ్ళంతా" అన్నాడు అత్రంగాచూపిస్తూ.

ఛటుక్కున కుర్చీలోంచి లేచి రోడ్డుమీద పోతున్న కుర్రాళ్ళవైపు చూశాను.

"ఎవరు ... ఆ గాగుల్స్ పెట్టుకున్న కుర్రాడేనా..."

"బెల్‌బాటమ్ ఫాంట్ వేశాడు... క్రింద ఫోల్డింగ్ కూడా వుంది చూశారా అతనే..."

జిలానీ చెప్పిన కుర్రాడ్ని పోల్చటం ఏమంత కష్టమనిపించలేదు.

"ఎప్పుడూ మంచి స్టయిల్‌గా తయారవుతుంటాడు లేండి..." అన్నాడు తిరిగి.

"అయితే ఆ ప్రబుద్ధుడేనన్నమాట ఈ పిల్లకి పేరు పెట్టింది" అన్నాను.

"మీరు భలే కనిపెట్టేశారే" అన్నట్టు చిన్నగా నవ్వి–"ఈ అమ్మాయిని అతడు ప్రేమిస్తున్నాడంట" అన్నాడు జిలానీ.

"అబ్బో! పెద్ద కథే వుందే..."

"ఈ మధ్యనే అనుకుంటాను...లవ్‌లెటర్ రాసి చేతికందించాడంట..."

"నీ కెవరు చెప్పారు..." నవ్వకుండా వుండలేకపోయాను.

"కాలేజీ కుర్రాళ్ళంతా యిక్కడికి వస్తుంటారు కదండి...వాళ్ళు అనుకుంటుంటే విన్నాను."

"ఆ అమ్మాయి ఏమందట..."

"ఇంకా రిప్లయ్(జవాబు)లేదంటండి..."

"మరి లవ్‌లెటర్ అలా చేతికందిస్తుంటే ఆ పిల్ల ఏమీ అనలేదా..."

"చదువుకుని తర్వాత చూస్తానందట..." తనకు తెలిసింది అంతవరకే అన్నట్టు నాన్చేశాడు జిలానీ.







# ఫరెవ్వార్ పెర్ఫ్యూమ్

ఎంతోకాలం నిలిచే పరిమళాలకు
ఇప్పుడు సులభంగా దొరుకుతోంది.

రాబోయే ఉత్తేజకరమైన సన్నివేశాలను గుర్తుచేసే పరిమళం... ఆ పరిమళంతో కలిగే నిజమైన అనుభూతి... ఇంద్రజాలమనిపించే పరిమళం...

మనసు మైమరిపించే పరిమళానికి మరో పేరు... ఫరెవ్వార్ పెర్ఫ్యూమ్.

ఫరెవ్వార్ పెర్ఫ్యూమ్ కేవలం పెర్ఫ్యూము పేరు మాత్రమే కాదు. మీకు ఇది నిజంగా అపూర్వమైన అనుభవాన్ని ఇస్తుంది. ఇది మీలాగే ఎంతో సహజమైన ఆకారాలు చిందిస్తుంది.

ఫరెవ్వార్ పెర్ఫ్యూమ్ పరిమళ ద్రవ్యాలను తయారు చేయడంలో పేరెన్నికగన్న పారిస్ దేశపు విజ్ఞానంతో రూపొందించబడినది.

**మిమ్మల్ని ఎల్లప్పుడూ మనోహరంగా రంజింపచేసేందుకే!**

FP.G.I. TL.

## సరికొత్త ప్రేమ కథ

"సరిపోయింది" అని—"సరేకాని ఆ పిల్ల రోజూ యిక్కడికి వస్తుంటుందా" అని అడిగాను.

"రోజూ రాదు... కానండి అప్పుడప్పుడూ వస్తుంటుంది" జిలానీ నవ్వులో చిన్న అనుమానం వుంది.

"పోనీ.. రోజూ యిలాగే వెళ్తుంటుందా"

"కాలేజీకి వెళ్ళటానికి యిక్కడిదే వచ్చి బస్ ఎక్కుతుంటుంది"

"అయ్‌సీ..." చిన్న ఆలోచన తళుక్కున మెరిసింది.

ప్రతీ సాయంత్రం మేడమీద యిన్స్టిట్యూట్‌లో టైప్ నేర్చుకోటానికి వస్తాది" జిలానీ ఏదో చెప్తూనే వున్నాడు

ఇంతలో చక్రవర్తి వచ్చాడు. కథ అసంపూర్తిగా ఆగిపోయింది

* * *

మర్నాడు—బుక్ సెంటర్‌కి బయలుదేరాను. సరిగ్గా మెట్లెక్కుతున్న సమయంలో అంత దూరంలో ఆ అమ్మాయి కనిపించింది బస్ స్టాప్ వైపే వస్తోంది ప్రక్కన యింకో అమ్మాయి కూడా వుంది. దూరంగా కుర్రవాళ్ళ కేకలు వినిపిస్తున్నాయి

"వరేయ్ చింటూ... బాబీ వచ్చిందిరా!" అని కొందరూ

"అప్పుడేతయారయ్యారా బాడీగార్డులు" అని కొందరూ అరుస్తున్నారు.

అంతలో ఆ చింటూ అనే కుర్రవాడు అతని మిత్రులు కొందరూ మూకవుమ్మడిగా ఆ అమ్మాయిల వెనకపడ్డారు

క్షణకాలంఆదృశ్యంచూస్తూవుండిపోయాను.

ఆ అమ్మాయి మాత్రం ఏమీ పట్టించుకోకుండా— నవ్వేస్తూ ప్రక్కన వున్న అమ్మాయితో తెగవాగేస్తోంది వాళ్లరాకతో బస్‌స్టాప్ నిండింది చాలా గోలగా వుంది.

క్షణకాలం తర్వాత—వున్నట్టుండి ఆ అమ్మాయి బుక్‌షాప్ వైపుతిరిగి త్వర త్వరగా మెట్లెక్కింది.

నేనింకాబయటే నిలబడి వున్నాను. ఆ హఠాత్పరిణామానికి నాకు తెలియకుండానే కాస్త కంగారు పడ్డాను ఆ తర్వాత అనిపించింది. ఆ పిల్లని చూసినప్పుడల్లా ఎందుకలా పులిక్కిపడ్డున్నానా అని ఎంతమంది అమ్మాయిలతోనో పరిచయం వుంది. ఎంతమంది తోనో రాసుకుని తిరిగిన అనుభవం వుంది. ఎంతమంది ప్రేమల్నో తృణీకరించిన కథలు గుర్తున్నాయి కాని ఈ అమ్మాయిని చూడగానే ఏదోలా అయిపోతున్నట్టుంది. ఏదో జన్మలబంధంలా ఎన్నెన్నోజన్మల అనుబంధంలా మనసును కదిలించి వేస్తోంది ఆమె రూపం.

చూడకూడదనుకుంటూనే ఆమె వైపు చూశాను. ఆశ్చర్యం! కన్నార్పకుండా నావైపే దీక్షగా చూస్తోంది ఈ సారి జడుసుకోలేదు మామూలు ధైర్యం వచ్చేసింది. పరీక్షగా చూశాను.

చటుక్కున చూపులు తిప్పుకుని జిలానీ వైపు తిరిగి—"తెల్ల కాగితాలున్నాయా" అని అడిగింది.

ఓరకంటితో నావైపే చూస్తోందన్న విషయం గ్రహించక పోలేదు.

కాని కారణం మాత్రం వూహించలేకపోయాను

ఇలాంటి రసవత్తర ఘట్టంలో—

చింటూ, అతనిమిత్రబృందం కోతిమూకలా వచ్చి పడ్డారు బుక్‌సెంటర్ మీద

నాకు చాలా చిరాకేసింది కుర్రాళ్లకి చూస్తే వదహారు పదిహేడు యేళ్ళుంటాయేమో? తల్లిదండ్రులు బాగా గడించి పెడుతున్నారేమో—హిప్పీ వేషాలతో— మోడరన్ ఫేషన్సుతో చాలా చలాకీగా వున్నారు

వాళ్లకి క్రింధా మీదా అనే తేడాలేదు తన పర భేదం లేదు. ఎందరినైనా తోసేస్తారు. ఎక్కడైనా గుమిగూడ్తారు

వాళ్ళమధ్య నిలబడటం సభ్యతగావుండదని అక్కడ్నుంచి దూరంగా వెళ్ళిపోయాను.

ఆ పిల్ల చూపులు మాత్రం నామీదే వున్నాయి. ఆ కుర్రాళ్ల గొడవ పట్టించుకోకుండా నేను వెళ్లినవైపే చూస్తోంది. ఆ విషయం నన్ను చాలా ఆశ్చర్యపరిచింది. ఆ అమ్మాయి నిజంగా నావైపేచూస్తోందా లేక మెల్లకన్ను లాంటిదేమైనా వుందా అన్న అనుమానం రాకపోలేదు. ఛత్! అంత అందమైన కళ్లకి మెల్ల వుంటుందా ...వుండకూడదు ..ఓయ్ భగవంతుడా అలాంటి పాడు పని మాత్రం చెయ్యకు అనుకున్నాను.

ఆ అమ్మాయి బస్‌స్టాప్‌వైపు వెళ్లింది. కోతిమూక కూడా పడింది.

నేను బుక్ సెంటర్‌లోకి వెళ్లి కూర్చున్నాను, అక్కడ నుంచి చూస్తుంటే ఆ పిల్ల కనిపిస్తోంది. కాని నా వైపు







గ్లాక్సో*
వారి నైసిల్
*ట్రేడ్ మార్క్

# ఉదయము స్నానము తర్వాత శరీరముపై నైసిల్ చల్లుకోండి...



# ప్రిక్లీహీట్ బాధ మీకు తెలియదు.

వైద్య పరీక్షల అనుసారం ఎక్కువ చెమట స్వేద గ్రంధులను మూసివేయటము వల్ల ప్రిక్లీహీట్ వస్తుంది. దురద, బాధ కలుగుతుంది. ఇది ఇలా వ్యాపిస్తూనే ఉంటుంది. క్లోరోఫెనెసిన్ మరియు బోరిక్ పౌడర్ కల్గిన నైసిల్ 'గ్లా' మాత్రమే దీనిని ఆపగలదు. ఇంకా ఇందులో మిశ్రితమైన జింక్ ఆక్సైడ్ శరీరమునకు ఉపశాంతి మరియు రక్షణ ఇస్తుంది.

SISTA'S-GN-410 TL

చూడటంలేదు. బస్‌కోసం ఎదురుచూస్తోంది.

బస్‌స్టాప్‌లో చోటులేక యిద్దరు కుర్రాళ్లు అక్కడే వుండిపోయారు. ఆ పిల్ల కథే చెప్పుకుంటున్నారు.

''నిజంగా బాబీకి గొప్ప డేరింగ్ కదరా'' అన్నాడు ఒకడు.

''డేరింగ్ అంటే డేరింగ్ కాదురా...వేరీ బోల్డ్ గర్ల్...'' అన్నాడు రెండోవాడు.

''లేకపోతే చింటూగాడు చెయ్యి అడ్డం పెట్టటం ఏమిటీ-ఈ డేమ్సెల్ ( కన్య ) ధైర్యంగా వాడి చేతిని ప్రక్కకుతీసి వెళ్లటం ఏమిటి. మన కాలేజీ హిస్టరీలో ఎప్పుడైనా జరిగిందంటావా''

ఏదో వాడొక్కడికే తెలిసినట్లు మాట్లాడుతున్నాడు మొదటివాడు. ఎదురుగా ఓ ఓల్డ్ స్టూడెంట్ వున్నాడనీ ... వాడి రోజుల్లో ఎన్నెన్ని వింతలో జరిగేవనీ వాడికేం తెలుసు పూర్ ఫెలో...చిన్నగా నవ్వుకున్నాను.

''కాని వీడుమాత్రం వెంచర్ (సాహసం) చెయ్యలేదేంటి ?'' రెండోవాడు అంటున్నాడు.

''నిజమేరా...వీడూ జీనియస్సే అనుకో... లేకపోతే లవ్‌లెటర్ చేతికిచ్చిన మగాడు ఎవ్వడా...పైగా యిది లవ్‌లెటర్ అని ముఖం మీదే చెప్పేశాడంట...''

''దానికి బాబీ యేమందో తెల్సా...చదువుతాను...తర్వాత కనిపించండి అందిరా''

''నీకెలా తెలుసురోయ్ ..''

''నాకు తెలీకపోవటం. ఏమిటిరా ... ఆరోజు చింటూగాడి ప్రక్కన నేనూ వున్నాను కదరా''

# సరికొత్త ప్రేమ కథ

''హౌ బ్రేవ్ షిఈజ్... (ఎంత ధైర్యం ఆమెకు)...''

ఇంతలో బస్ వచ్చింది...కుర్రవాళ్లిద్దరూ ఆడవాళ్లు వున్నచోటుకి పరుగెత్తారు.

ఆ తరవాత జిలానీ అసలు కథ చెప్పటం ప్రారంభించాడు.

''మొన్న ఈమధ్య కాలేజీ ఎలక్షన్లు అయ్యాయికదండీ...చింటూ ఫ్రెండ్ ఒకతను జాయింట్ సెక్రటరీగా పోటీ చేశాడట. పోలింగ్ రోజున బాబీ ఓటు వెయ్యటానికి వెళ్తోందట ... గుమ్మం దగ్గర ఆపేసి మీ ఓటు మా వాడికే వెయ్యాలన్నాడట వింటూ ... బాబీ మాట్లాడకుండా వెళ్లి పోతుంటే చెయ్యి అడ్డంపెట్టి ప్లీజ్ ఓటు వేస్తాననండీ అన్నాడట ... ఆ అమ్మాయి నవ్వేస్తూ చేయి ప్రక్కకు తీసి తప్పు అలా బలవంతం చెయ్యకూడదు అని వెళ్లిపోయిందట...అంతే ఆ మాటతో అయిసు అయిపోయినట్లున్నాడు పిర్నాడు లవ్‌లెటరు రాసి చేతికి అందించాడట ... మరి దాని సంగతి ఏమయిందో ఏమిటో'' అన్నాడు

'' ఆ చింటూనే అడక్కపోయావా '' అన్నాను అనాలోచితంగా.

''నిన్న యిక్కడికివస్తే అడిగానండి ... యింకా రిప్లయ్ రాలేదు అన్నాడు''

''మరి రిప్లయ్ ఎప్పుడు యిస్తానందో తెలుసుకోలేదా మన చింటూ మహాశయుడు''

''నిన్నసాయంత్రం మళ్లీ అడిగాడంట ... యింకా ఆ వుత్తరం చూడలేదు అందట...''

''చచ్చాంపో ... యిదేదో పెద్ద మున్సిపల్ ఆఫీస్‌లాగేవుంది''

* * *

మర్నాడు యథాప్రకారం పదిగంటలకల్లా బుక్ షాపు చేరుకున్నాను. అప్పటికే ఆ అమ్మాయి అక్కడ ప్రత్యక్షమైవుంది. పచ్చిరాసి పద్ధతిలో వోణీ వేసుకుంది. అంచేత వెంటనే పోల్చుకోలేకపోయాను.

ఎవరో అనుకుని – ''ఏం జిలానీ బాగున్నావా'' అంటూ షాప్‌లోకి వెళ్ళి వెనక్కు తిరిగి చూస్తును కదా ఆ అమ్మాయి బాబీయే. కాస్త మొహమాటపడ్డాను. చిరు మందహాసంతో నావైపే చూస్తోంది. అంత యిదిగా పట్టిపట్టి ఎందుకు చూస్తుందో నాకు అర్థంకాలేదు. సుమారు నేనుకూడా అలాగే చూస్తున్నాను కాబోలు కాస్త సిగ్గు పడి తలవంచుకుంది.

ఈసారి పిల్లరూపం నన్ను బాగా ఆకట్టుకుంది. కొంచటిసి ప్రేమిస్తున్నానా అనిపించింది. మరుక్షణం అలాంటి ఆలోచనవచ్చినందుకు నన్ను నేనే తిట్టుకున్నాను.

ఒరే నిరుద్యోగీ నీకూ ఆపిల్లకీ సరిగ్గా ఏడేళ్లు తేడా వుంటుంది... నువ్వేమో తిని కూర్చునే నిరుద్యోగివి ... నీపొట్టే నువ్వు పోషించుకోలేని బడుద్ధాయివి ... నీకు ప్రేమ ఏమిటిరా... అదీకాక నాకు తెలీక అడుగుతాను ఈ అయిదేళ్లబట్టీ లేనిప్రేమ వున్నట్టుండి యిప్పుడు ఎలా పుట్టుకొచ్చిందిరా అని నిలదీశాడు ఆత్మగాడు. అంతే గప్‌చిప్ అయిపోయాను. ఆమె వెళ్లిపోయింది, మళ్లీ ఆపిల్ల వైపుచూస్తే ఒట్టు.

జీలానీని ఏమీ అడగలేదు. కాని జిలానీయే చెప్పటం మొదలు పెట్టాడు. ''ఇందాక మీరు రాకముందు చింటూ వచ్చాడు ... మియ్‌డస్ కావాలి యిస్తారా అని అడిగింది, వెంటనే వ్రాసిచ్చాడు... ఎందుకని అడిగితే... ఏ విషయం మీకు వుత్తరం వ్రాస్తాను అంది నిజంగా ఆ అమ్మాయికి ఎంత ధైర్యమండి'' జిలానీ కళ్లింతచేసి చూస్తూ చెప్పాకు

(49 వ పేజీ చూడండి)



గుజరాత్‌లో ఎన్నికలు జరిపించమని కోరుతూ నిరాహారదీక్ష చేసిన శ్రీ మొరార్జీదేశాయ్, ఆ దీక్షను విజయోత్సవంతో విరమిస్తున్నప్పుడు ఆయనని అభినందిస్తున్న శ్రీ కామరాజ్, శ్రీ జై ప్రకాశ్‌లు.

# జీవితంలో మంచివి కొన్ని ఉత్తమమైన ఆదరణకు తగుతాయి

మీకు ఉండే మంచి వాటిల్లో మీ తెల్లటి నూలు వస్త్రములు ఒకటి. నాసిరకపు బ్లూలను తిరస్కరించండి మీ నూలు వస్త్రములకు తగిన పోషణను ఇయ్యండి. రాబిన్ బ్లూనే వాడండి. మేలైన నాణ్యతకల బ్లూ.

# రాబిన్ బ్లూ

తెల్లని నూలు వస్త్రములను లాభకరంగాను, సురక్షితంగాను అదనపు ప్రత్యేక తెలుపు చేస్తుంది.



తెలుగు నవల సాహిత్య వికాసం

సాహితీ సామ్రాజ్యంలో పట్టం కట్టి రారాజరికం నెరపిస్తూన్న నేటి కాలంలో, ఆ నవలా సాహిత్యపు తీరుతెన్నులను సహేతుకంగా వ్యాఖ్యానిస్తూ ప్రఖ్యాత రచయిత 'సాహిత్య భూషణ' శ్రీ పుల్లాభొట్ల వేంకటేశ్వర్లు రచించిన "తెలుగు నవలా సాహిత్య వికాసం" 1872 వసంవత్సరం నుండి 1974

# అవీ ఇవీ అన్నీ

సంవత్సరం వరకు తెలుగులో వెలువడిన వైవిధ్య విలసితాలైన వేయికిమించిన నవలలను పరామర్శించింది. 700 పుటలకు మించిన వీరి యీ గ్రంథం యిటీవలనే ఖమ్మంలో ఆవిష్కరించబడింది. నాగపూర్ విశ్వవిద్యాలయ ఆంగ్లోపన్యాసకులు డా. పోతుకూచి సుబ్రహ్మణ్యంశాస్త్రి గ్రంథావిష్కరణంజరిపారు. ఈ సభకు ఖమ్మం కళాశాల ప్రధానాచార్యులు శ్రీ కె. వై. ఎల్. నరసింహారావు అధ్యక్షతవహించారు. జిల్లా కలెక్టరు శ్రీ పి. వి.

ఆర్. కె. ప్రసాద్ సభా ప్రారంభం చేశారు.

శ్రీ హీరాలాల్ మోరియా అతిథులకు స్వాగతం చెప్పారు. (ఒ. వి.)

### ఖిలాయిలో ఉగాది

ఖిలాయి ఆంధ్రులు రాక్షసనామ ఉగాది వేడుకలు చేసుకున్నారు ఎమ్. ఎస్. శాస్త్రి పంచాంగపఠనం ఒ. ఎస్. రావు బి. శ్రీరాములు సి. ఎస్. రావు ప్రభృతులంతా వేదికపై వేడుకలలో పాల్గొన్నారు. శర్వాణి ఆర్ట్స్ వారు ధర్మం దారితప్పితే అన్న నాటకం వేశారు. దర్శకుడు. సి. ఎస్. శర్మ, రచయిత రావుల తాతారావు సంగీతం కృష్ణమాచారి, రంగాలంకరణ వెంకట్రావు నటులు. ఎమ్. వెంకటేశ్వర్లు ఎమ్. ఎల్. నాయుడు, సి. ఎస్. శర్మ, కుమారి జయలత, రాజగోపాల్, డి. వి. సత్యనారాయణ మాస్టర్ ప్రసాద్ మున్నగువారు చక్కగా తమ తమ పాత్రలు నిర్వహించారు

## అ పి—ఇ పి—అ న్నీ

### బరంపురంలో ఉగాది

బరంపురంలో టవున్‌హాలులో నవ్యశ్రీ కళా సమితివారి ఆధ్వర్యంలో ఉగాదినాడు-సాహిత్య సభ 4 గంటలపాటు జరిగింది. తెలుగుభాషా సంస్కృతి మొదలు తెనుగు ప్రపంచ సభల వరకుగల వివిధ అంశములమీద వేదుల కృష్ణమూర్తి, బంకుపల్లి లక్ష్మణశాస్త్రి, కె. రామచంద్రయ్య, వి. అప్పన్నశాస్త్రి ప్రభృతులు పాల్గొన్నారు. బరంపురం తెనుగు వారెందరో హాజరైనారు. (ఒ. వి.)

### చదరంగం ఎత్తులు

ఐస్‌లాండ్‌లో బోరిస్ స్పాస్కీ, రాబర్ట్ ఫిషర్‌ల మధ్య 1972 లో జరిగిన చదరంగం పోటీలను సినిమా తీయడానికి చెస్టర్ ఫాక్స్ అన్న ఆసామి హక్కులు కొన్నాట్ట. కాని చదరంగం పోటీలు జరుగుతున్నప్పుడు ఆ హాల్లో మూవీ కెమారాలు వుండకూడదని ఫిషర్ ఆంక్ష పెట్టి సినిమా తీయనీయలేదట. దీనితో చెస్టర్ ఫాక్స్ ఫిషర్‌మీద 3,250,000 డాలర్ల దావా వేశాట్ట కేసు ప్రస్తుతం న్యూయార్క్ సుప్రీంకోర్టులో విచారణ జరుగుతున్నది.

### ఎగ్జిబిషన్ సావనీర్

కృష్ణా పారిశ్రామిక ప్రదర్శనం 1975 విజయవాడకు సంబంధించి నిర్వాహకులు వేసిన సావనీర్ యింగ్లీషు తెనుగు భాషల వ్యాసాలలో 110 పుటలు గల పుస్తకంగా వెలువడింది. ఎడిటోరియల్ బోర్డ్ కన్వీనర్ శ్రీ కె. వి. పద్మనాభరావు వ్యాసాలు. ఫొటోలు అవీ బాగున్నాయి. వెల తెలియలేదు.

# సరికొత్త ప్రేమ కథ

(44వ పేజీ తరువాయి)

పోతున్నాడు నిజమే వింత ధైర్యం అనుకుని నవ్వేసి వూరుకున్నాను

ఆ రాత్రంతా ఆ పూర్వాశి గురించీ .. ఆ చింటూగాడు వ్రాసిన ప్రేమలేఖ గురించే నా ఆలోచన ఏమైనాసరే ఆ అమ్మాయితో పరిచయం సంపాదించి ఆ ప్రేమకథ అంతేమిటో చూడాలని నిశ్చయించు న్నాను ఈ నిరుద్యోగి పర్వంలో యిదొక అజ్ఞాత వాసం అని అఘోరించు అని తిడూ నిద్రపోయాడు ఆత్మగాడు

ఆ తెల్లవారుజామునే పరిచయం చేసుకోటానికి తగిన ప్లాన్ తయారుచేసి పెట్టుకున్నాను పొద్దున్నే లేచి వున్నబట్టల్లో కాస్త మంచిబట్టలు పైకితీసి యిస్త్రీచేసి వేసుకున్నాను మూడింటికి వచ్చేసరికి బుక్‌షాప్ మూసివుంది ఆపద్బాంధవుడిలా చక్రవర్తి కనిపించాడు. ఇదీ ఒకందుకు మంచిదే అనిపించింది

ఆ పరిసర ప్రాంతాలన్నీ చూశాను. ఆ అమ్మాయి వున్నజాడ కనిపించలేదు

కాస్సేపు అక్కడే తచ్చాడి నీడగా వుందని లైబ్రరీ టెరస్ క్రిందకి చేరాం

యథాప్రకారంగా నాచూపు ఎదురుగావున్న బస్‌స్టాండ్ మీదకు వెళ్ళింది అంతే అక్కడే ఆగిపోయింది. ఇంకెవరు, ఎందరో కుర్రాళ్ళ స్వప్నసుందరి సాక్షాత్కరించి వుంది అక్కడ

"గురూ పదోనెంబరుబస్ వెళ్ళి ఎంత సేపయ్యిందంటావ్" వున్నట్టుండి అడిగాను

"యిప్పుడెకదగురూ వెళ్ళింది. ఓ నిముషం అయివుంటుంది "అన్నాడు చక్రవర్తి.

మరో పదినిముషాల వరకూ యూనివర్సిటీ వైపు వెళ్ళే బస్ రాదని నాకు తెలుసు ఆ పదినిముషాల్లో పరిచయం సంపాదించుకోటం పెద్ద కష్టం కాదనిపించింది

"చూడు మిత్రమా నేనిప్పుడే వస్తాను. . అంతవరకూ కదలకుండా యిక్కడే నిలబడు " అన్నాను

"ఏమిటి గురూ నీ కంగారు చూస్తుంటే ఎక్కడో పడిపోయేటట్టున్నావ్ అసలేం జరిగిందో చెప్పు" అన్నాడు హాస్యధోరణిలో

"ఏమీలేదు కాని . ఆ బస్‌స్టాప్‌లో ఒక అమ్మాయి వుంది చూశావా"

"ఊ "

'ఆ అమ్మాయితో మాట్లాడి వస్తాను " అన్నాను ఆత్రంగా

"అమ్మాయి మాత్రం అదిరిందిగురూ"

కళ్ళప్పగించి చూస్తున్నాడు చక్రవర్తి

"నీకు పుణ్యం వుంటుంది కాని ... యిప్పుడేమీ గొడవ చెయ్యకు కథ మంచి పట్టులో వుంది యిటు చూడు మావైపు చూడనట్లు నిలబడు ఓ-కె" అన్నాను మెట్లు దిగుతూ

"బెస్ట్ ఆఫ్ లక్ గురూ " అన్నాడు చక్రవర్తి నీరసంగా అతని బాధేమిటో నేను వూహించలేక పోలేదు

ధైర్యంచేసి వెళ్తున్నానేగాని ఎందుకో కాళ్ళు వణుకుతున్నట్లూ, గుండె దడదడలాడుతున్నట్లూ అనిపించింది వెనక్కు తగ్గితే బాగుండదని (చక్రవర్తి దృష్టిలో చులకనవుతానని) తెగించి ముందుకు నడిచాను

అదృష్టంకొద్దీ బస్‌స్టాప్‌లో ఆ అమ్మాయి మరో ఆవిడ వున్నారు ఆ వున్న ముసలావిడ కూడా దూరంగా నిలబడింది

దగ్గరకి వెళ్ళి చిన్నగా దగ్గాను నావైపు తిరిగిచూసింది ఆ అమ్మాయి వెంటనే ఆమె ముఖం మీద ఓ చిరునవ్వు కనిపించింది అది చూశాక కాస్త హుషారు పుట్టుకొచ్చింది నాలో

"ఎక్స్‌క్యూజ్‌మీ"అన్నానుధైర్యంచేస్తూ.

ఏమిటన్నట్టు చూసింది నా వైపు. ఫర్వాలేదు నవ్వు ముఖంతోనే

"మీతో కొంచెం మాట్లాడాలి " ఆమాటలన్నాక తప్పటడుగు వేశానేమో అనిపించింది

"ఏమిటో చెప్పండి " ముఖంమీద చిరునవ్వు దూరమయ్యింది కాసే రెండడుగులు దగ్గరికి వచ్చాయి

"మీరు యూనివర్సిటీకే నా వెళ్తున్నారు " మాట మార్చటం తప్పనిసరి అయ్యింది

"లేదు , యింటికి వెళ్తున్నాను ." దురుసుగా వచ్చింది సమాధానం

"యిల్లెంటే "

"సెంచరీ క్లబ్ వరకూ వెళ్ళాలి . . '

మాటల్లో మార్పులేదు

"మీరు ఏంచదువుతున్నారు "

"బి ఎస్‌సి " ఇదే విసురు

"ఏ గ్రూప్ " చెప్పింది విసుక్కుంటూ

"ఈరోజు కాలేజీకి వెళ్ళవనుకుంటాను "

'ఊ' అంది రెండడుగులు వెనక్కువేస్తూ.

ఆ పైన ఏం మాట్లాడాలో అర్థంకాలేదు మీ పేరేమిటి అని అడుగుదామనుకున్నాను కాని అవకాశం యివ్వలేదు (ఇంకా వుంది)



వేంద్రమంత్రుల శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి శ్రీశైలంలో శ్రీ మల్లిఖార్జుని దేవాలయాన్ని దర్శించినప్పటి చిత్రం వారి సతీమణి శ్రీమతి రాఘవమ్మ నందీశ్వరుని శృంగాల మధ్యనుంచి శ్రీ మల్లిఖార్జుని దర్శిస్తున్న దృశ్యం

Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna

# ఈ వేసవిలో మీ పిల్లలకు ఎక్కడ చెమట పేలుడు సంభవిస్తుంది?




ఎక్కడ పేలినప్పటికీ, జాన్సన్స్ ప్రిక్లీహీట్ పౌడరుతో అరికట్టండి. ఒక్క జాన్సన్స్ ప్రిక్లీహీట్ పౌడరు మాత్రమే 3 రకాలుగా పనిచేయు ఋజువైన ఔషధీయుక్త ఫార్ములా కలిగియున్నది.

- చెమటను పీల్చుకొని, చర్మముల రంధ్రములను మూసివేయుటను అరికడుతుంది.
- క్రిముల పెరుగుదలను నిరోధిస్తుంది.
- చల్లదనం, హాయిని చేకూర్చి తక్షణ ఉపశమనము చేకూరుస్తుంది.

స్నానము తదుపరి మరియు నిద్రపోవుటకు ముందు జాన్సన్స్ ప్రిక్లీహీట్ పౌడరు విరళంగా చల్లండి. అది ఒక్కటే తల్లులు విశ్వసించే ఔషధీయుక్తమైన పౌడరు; చెమట పేలుడు నుంచి ఉపశమనమును కల్గించేది — తక్షణమే.




చందనపు సువాసనలో గూడా దొరుకుతుంది.

## ఒక్క జాన్సన్స్* ప్రిక్లీహీట్ పౌడరు మాత్రమే మంటను ఆపుతుంది, దురదనుంచి ఉపశమనం ఇస్తుంది. తక్షణమే.

Johnson & Johnson*

